1. కొత్త విలువల బ్రతుకు.
2. మూడు నడిపిన విప్లవం.
3. వారసులు.
4. మాతృమూర్తి.
5. ఏకాంతం.
6. రాయబారి.

# క్రొత్త విలువల బ్రతుకు

పోతుకూచి సాంబశివరావు



వాణీ గ్రంథమాల
సికిందాబాదు.

# క్రొత్త విలువల బ్రతుకు



రాజా, నేను అప్పచెల్లెళ్ళ బిడ్డలము. రాజాకు తల్లి చిన్నప్పుడే చనిపోయింది. తండ్రి పదిసంవత్సరాలు వచ్చాక గతించాడు. తల్లి తండ్రులు లేని రాజా అంటే జాలి అభిమానం కలిగి మా పేరిశాస్త్రి మామయ్య తనదగ్గరకు తీసుకుని విద్యాబుద్ధులు చెప్పించసాగారు.

మా మామయ్యా, నేను, రాజా, ఒకేఊళ్ళో ఉంటుండడం వల్ల రాజాకు, నాకు, బంధుత్వమటుంచి స్నేహంబాగా పెరిగింది. వయస్సులో ఒక సంవత్సరంతేడా ఉన్నా ఇద్దరంఎంతో కలిసిమెలిసి ఉంటూం డేవాళ్ళం. వీథుల్లో ఆటలాడుకోడం, బడికి వెళ్ళి చదువుకోవడం, సినీమాలకు వెళ్ళడం మొదలైన ప్రతీవిషయంలోనూ మేమిద్దరం కలిసి ఉండేవాళ్ళం.

రాజా మా కుర్రాళ్ళందరిలోనూ చాలా బుద్ధిమంతుడని ప్రతీతి. ప్రొద్దున్నే సూర్యోదయం కాకుండా లేచి, స్నానంచేసి, తలదువ్వుకుని ఉతికిన లాగూ చొక్కా తొడుక్కుని, పుస్తకాలు చదువుకునే వాడు. రాజా భోజనానికి పిలవగానే భోంచేసి, తిన్నగా స్కూలుకు వెళ్ళి, సాయంత్రం ఆటలు ఆడుకుని, ఏడుగంటలు కాకుండా యింటికి వచ్చి భోంచేసి చదువుకుని పడుకోడం రాజాకు నిశ్చిత దినచర్యగా ఉండేది. ఇంట్లో మామయ్యా, అత్తయ్యాచెప్పిన పనులు అతి జాగ్రత్తగా చేస్తూండేవాడు. మామయ్యాఅంటే చాలా భయభక్తులుగా ఉండేవాడు. నేను చిన్నప్పుడు బాగా అల్లరిచేస్తూ, ప్రతి నిమిషం ఎవరో ఒకరితో కజ్జాకు కాలు దువ్వుతూ దెబ్బలు తగుల్చుకుని యింటికి వస్తూఉండడం, రోజూ మానాన్న అమ్మ నన్ను తిడుతూండడం సహజంగా జరిగేవి.

చదువులో కూడా రాజాకే ఎప్పుడూ మంచిమార్కులు వచ్చేవి. నేను ఆషామాషీగా ఏదో ప్యాసయ్యేవాడిని.

వయస్సు వచ్చినకొద్దీ రాజాలో వినయం, నమ్రత, పెద్దలంటే గౌరవం మరీ ఎక్కువైయాయి. రాజాకు తండ్రి నాల్గెకరాల మాగాణి భూమి వదిలి వెళ్ళాడు. దానిమీద వచ్చే ఆదాయం పేరిశాస్త్రి మామయ్య జాగ్రత్త పెడుతూ రాజాకు ముందు వుపకరించేలా చేదామనే ఉద్దేశ్యంతో వుండేవాడు. అందుచేత డబ్బు అట్టే ఖర్చు పెట్టకుండా సామాన్యమైన దుస్తులు కొని రాజాకు యిచ్చేవాడు. పల్లెత్తుమాట ఎదురాడకుండా ఏదో బట్టకట్టుకుని, ఏదో భోంచేసి; చీకూచింతా లేకుండా రాజా కాలక్షేపం చేసేవాడు.

రాజా నేనూ కలిసి మాబంధువర్గంలో ఎవరికి కనిపించినా రాజాను పొగడడం నన్ను తిట్టడం జరిగేది. నేను మావాళ్ళతిట్లు అంత లెక్క చేసేవాణ్ణి కాదు. రాజా తన పొగడ్తలగురించి ఏమనుకొనేవాడో తెలియదు కాని, పైకి నవ్వుతూ మౌనంగా వుండేవాడు.

"మారాజా అంత బుద్ధిమంతుడు మరొకడు లేడంటే. వాడిగొడవ వాడికే కాని ఒకళ్ళ జోలిసొత్తు వాడికక్కర్లేదు. పాపం! వాళ్ళ నాన్న అమ్మ బ్రతికుంటే ఎంతో సంతోషించేవారు" అంటూ జాలిగా పేరిశాస్త్రి మామయ్య మా ఎదురుగా ఎప్పుడైనా స్నేహితులతో అంటుండేవాడు. రాజా యీమాటలు వినగానే కళ్ళు చెమర్చి ఏడ్వడం నేను చాలాసార్లు చూశాను. చనిపోయిన తల్లితండ్రులమీది మమకారంతో అలా ఏడ్చేవాడనుకునేవాడిని.

ఆస్తిపాస్తులలో మాయిద్దరికీ ఎక్కువ భేదం లేకపోవడంవల్ల, రాజా మంచి నడవడిక చూసి మా పేరిశాస్త్రి మామయ్య, రాజాను

అల్లుడిగా వరించాడు. మా మామయ్య కూతురు అనసూయ నిజంగా చాలా అందంగా ఉంటుంది. గుండ్రంగా పసుపుపచ్చని ఆమె ముఖంలో మిలమిల మెరిసే ఆమె కండ్లు దూరాన్నుంచి చూస్తే, పచ్చని సూర్య కాంత పుష్పంమీద రెండు గండు తుమ్మెదలు వాలినట్లుండేవి. మా అందరితో సరదగా కబుర్లు, కథలు చెబుతూ, కేరింతాలు కొడుతూ, చిలిపిగా నవ్వుతూండేది. అనసూయ అంటే నాకంటె మా అమ్మకు వెర్రి అభిమానం. మా పేరిశాస్త్రి మామయ్యను అనసూయను నాకిచ్చి పెండ్లి చెయ్యమని బలవంత పెట్టింది. మా మామయ్యకు ఇష్టంలేక పోయింది: మా అమ్మకు కోపంవచ్చి మూతి ముడుచుకుంది.

రాజాకూడా అనసూయ అంటే చాలా ఆప్యాయత చూపించే వాడు. వారి అన్యోన్యంచూచి అందరూ అనుకునేవారు, వీళ్ళిద్దరికీ పెళ్ళి అవుతే చిలకా గోరింకల్లా వుంటారని. అనసూయకూడా రాజానే పెళ్లి చేసుకోవాలని కోరుతున్నట్లు నాచెవినిపడింది. అంతటితో అనసూయ మీద నాకు అభిమానం తగ్గకపోయినా, నా భార్యకాదనే నిరాశ మాత్రం కలిగింది.

రాజా మొదటి తరగతిలోను, నేను మూడవ తరగతిలోను బి. ఏ. ప్యాసయ్యాము. ఆయేడే రాజాకు పెండ్లి చేసేస్తానని మా పేరిశాస్త్రి మామయ్య పట్టుపట్టాడు. పెద్దలందరూ సరే అనడం, లగ్ననిర్ణయం జరిగిపోయింది.

పెళ్ళిసన్నాహాలన్నీ చేశారు. బంధువర్గం క్రమంగా విడుదులు ప్రవేశిస్తున్నారు. అంతా కోలాహలంగా ఉంది. నేనుకూడా మామయ్యకు పెళ్ళి ప్రయత్నాలలో తోచినసహాయం చేస్తున్నాను. ఆరోజు తెల్లవారుఝామున ముహూర్తం. తెల్లవారే ముందు ఎలాగా నిద్ర ఉండదని, రాజాకు భోజనంపెట్టి పడుకోమన్నారు రాజా తన పడక గదిలోకివెళ్ళి పడుకున్నాడు.

ముహూర్త సమయానికి రాజాను లేపుదామని అతనిగదిలోకి వెళ్ళాను. అతను అక్కడలేడు. కాలకృత్యాలు తీర్చుకోడానికి బయటికి వెళ్ళేడేమో అని అరగంటదాకా చూశాను. అప్పటికీ అతను తిరిగి రాలేదు. ఏమి తోచక ఇటూ అటూ తిరిగి అతని ప్రక్క మీద వాలాను చిరాకుగా. చేతికేదో కాగితం తగిలింది. విప్పిచూశాను, అర్థమయింది. రాజా వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయాడు ఎక్కడికో!

రాజా వింత ప్రవర్తన అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఈ ముహూర్తం ముందు ఏంచేయాలో ఎవరికీ అర్థంకాలేదు. అతనిప్రవర్తన వల్ల పెండ్లి కావలసిన అనసూయ ముందు జీవితం దెబ్బతింటుందేమో అన్న భయం కల్గింది, పేరిశాస్త్రి మామయ్యకు. పైగా ముహూర్తం ముందు పరారి అయిన రాజా తన ప్రతిష్ట భగ్నం చేయడానికి లేచి పోయాడన్నంతరోషం వచ్చింది మామయ్యకు. మరో ఉపాయంతోచక తిన్నగా మా అమ్మదగ్గరకు వెళ్ళాడు మామయ్య. అనసూయ జీవితం, తన గౌరవం, కాపాడమని ఆమెను ప్రాథేయ పడ్డాడు. ఈ పరిస్థితులు యిలా విషమించినందుకు అమ్మ సంతోషించింది. మామయ్య యీ లగ్నంనాడు తన పరువు నిలబెట్టమనినన్ను ప్రాథేయ పడ్డాడు. కళ్లనీళ్ళు ౘ్రుక్కుకుంటూ బాధగా, వలవల వాపోతున్న అనసూయను చూశాను. ఆమెకేమైనా అభ్యంతరం ఉందేమో అని అడిగాను. మౌనంతో ఆమె అంగీకారం సూచించింది. రాజా బదులు, నేను పెండ్లికొడుకుగా మారడానికి ఒప్పుకున్నాను. ఆ లగ్నానికే నాకూ అనసూయకూ పెండ్లి అయిపోయింది. చుట్టూ ఉన్న తూతూబాకాలు, బాజా భజంత్రీలు, పురోహితుల మంత్రాలు చెవులు బ్రద్దలయ్యేటట్లు ప్రతిధ్వనిస్తున్నా, అనసూయ కన్నీటిలోంచి నాకురాజాయే కనపించాడు. అతనిమాటలే వినిపించాయి. అసలు రాజా ఎక్కడికి వెళ్ళిపోయాడు?

ఎందుకు వెళ్ళిపోయాడు? ఆ నే(ప్రశ్నలతో బాధపడుతున్న నాకు నా పెండ్లి ఎట్లా జరిగిందీ నాకేమి తెలియలేదు.

కాలప్రవాహంలో పది సంవత్సరాలు దొర్లిపోయాయి. నేను కంట్రాక్టరుల కంపెనీలో ఒక ఎకౌంటెంట్‌గా స్థిరపడ్డాను. హైదాబాదు బదిలీ అవుతే, అనసూయ, నేనూవచ్చి, కాపురం పెట్టాం. అప్పటికే నాకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. చిన్నప్పటి చలాకీ, అల్లరి, కేరింతాలు అణగిపోయి జీవితంలోని సమస్యలతో తీవ్రంగా సతమతమౌతున్నాను. పెద్దలంటే గౌరవం, ఆఫీసర్లంటే హడలు, స్నేహితులంటే మర్యాద, బంధువులకు సత్కారాలు, భార్యాబిడ్డలమీద అభిమానం మొదలైన లక్షణాలన్నీ నాలో వ్యాపించి స్వతంత్రబుద్ధి నశించి, ఒక కరడుకట్టిన బండరాయిలా మారిపోయింది బ్రతుకు.

అడపా దడపా ఆలోచనలమధ్య ఒక్కొక్కసారి నాకూ, అనసూయకు, రాజా జ్ఞాపకం వచ్చేవాడు. కాని మా బంధువర్గమంతా అతను చనిపోయాడన్నట్లే భావిస్తూ పూర్తిగా అతన్ని మర్చిపోయారు. మా పేరిశాస్త్రి మామయ్య రాజా కొద్ది ఆస్తి జాగ్రత్తగా తన సంసారానికి వినియోగించుకొంటున్నాడు. ఈ పది సంవత్సరాలలో రాజా ఎక్కడవున్నది ఏంచేస్తున్నది. ఒక్క ఉత్తరమైనా లేదు.

ఆఫీసుపని ముగించుకుని ఒకరోజు సాయంత్రం కొన్త వేడికాఫీ సేవిద్దామని తాజ్‌మహల్ హొటలులో ప్రవేశించాను. ఆఫీసరుగారి చిరాకు, యింటిదగ్గర అమ్మాయిల సుస్థి, అనసూయ చాకిరీ బాధ, చాలీ చాలని జీవితంతో నగర జీవితం, నాలో గిరున తిరిగిపోతున్నాయి. ఈ అతుకుల బొంత జీవితానికి ఎక్కడా అంతూదరి కనిపించటం లేదు. తరతరాల గుమస్తాల కుటుంబంలో పుట్టి అదేపద్ధతిలో నడుచుకుంటున్న నా

జీవితం యింతకన్న ఉత్కృష్టస్థానం పొందుతుందన్న ఆశ నన్నగిలి చాలాకాలమైపోయింది. చెరుకుపిప్పిలాగ జీవితంలో మధురత్వంపోయిన బాధతో ఏదో గ్రుక్కెడు కాఫీ గొంతుకలో పోసుకుంటున్నాను.

నాఎదురుగా కుర్చీలో ఠీవిగా స్పెన్సరు చుట్ట కాలుస్తూ, ఫెల్టు హేట్ పెట్టుకుని, సిల్కు బుష్‌కోటు, వులెన్ ఫాంటుతో, మెరుస్తూ మధ్య వయస్సుమనిషి ఒకాయన కూర్చున్నాడు. నా ఆలోచనల తలదిమ్ము ఆసమయంలో అటువంటి ధనికుణ్ణిచూడడమంటేనే అసహ్యం, అవమానం, కలిగించింది. ఆ మనిషిని తేరిపారి చూడడానికి జంకాను, సెర్వరు బిల్లు యిచ్చాడు. నాచెయ్యిముందుకు రాకముందే ఆకుర్చీలో కూర్చున్న మనిషి నాబిల్లుతీసుకున్నాడు. ఒక్కసారి ముఖమెత్తి ఆశ్చర్యంగా చూశాను.

'రాజా!' అప్రయత్నంగా నోరు ఆవలించాను రాజా ఆకారంలో ఎక్కువమార్పేమీలేదు. చిదానందంగా నవ్వుతూ చుట్టపొగలు మేఘాలుగా విరజిమ్మేడు రాజా.

"నువ్వు యిక్కడికి ఎలావచ్చావు?" యిద్దరం ఒకేసారి ప్రశ్నించుకున్నాం, ఆ ప్రశ్నకు సమాధానాలు వెతుక్కుంటూ, యిద్దరం ఒకే సారి నవ్వుకున్నాం.

"తే తర్వాత చెప్తాను" అంటూ రాజా నాబిల్లు చెల్లించి బయటికి తీసుకువచ్చాడు, నాభుజంమీద చెయ్యివేసి హృదయానికి అదుముకుంటూ.

రాజా చేసైగతో బర్రున ఒక టాక్సీవచ్చి మాముందు ఆగింది. ఇద్దరంలోపల కూర్చున్నాం. విద్యుద్వేగంతో కారు పరుగెత్తింది.

"ఈవేళ చాలా సంతోషంగాఉంది రాజా. నిన్నుకలుసుకోవడం చాలా చిత్రగా ఉంది.

"మామయ్యా, మీఅమ్మ, నాన్న, అందరూ కులాసానా?"

"ఆ. అనసూయ ఇక్కడేవుంది" మాయిద్దరికీ పెళ్ళిఅయింది.

"అవుతుందని తెలుసు".

"రాజా! ఇంత కాలం ఎక్కడున్నావు? ఏంచేస్తున్నావు?"

"త్వరలో చూద్దువుగానిగా! నేనుండేచోటికే వెడుతున్నాము!"

"అసలు ఎందుకు వెళ్ళిపోయావు రాజా ఆరోజు రాత్రి! నాకు చాలా బాధ అనిపించింది."

ఒక చిరునవ్వు నవ్వేడు రాజా.

కారు చార్ మినార్ వద్ద ఆగింది. రాజా నేను కారుదిగాము.

రాజా నడుస్తుంటే నేను అతన్ని అనుసరించాను. సందులు గొందులు దాటి ఒక పాడైన, శిథిలమైన గోడలమధ్యఉన్న పెంకుటింటికి వెళ్ళాము.

ఆయింటి ఆవరణలో అడుగుపెట్టగానే, జిడ్డుముఖంతో పీచుగెడ్డం వేళ్ళాడించుకుంటూ గళ్ళలుంగీ కట్టుకుని, హుక్కా పీలుస్తున్న సాహెబు, ఎర్రని చింతనిప్పుల్లాంటి కళ్ళతో మీసాలు మెలివేసుకుంటూ ఆలోచిస్తూ కూర్చున్ననల్లటి ఆసామీ, సినీతారల బుష్ కోటు తొడుక్కుని గిరజాల జుట్టుతో, సిగరెట్టుదమ్ములు కొడుతూ ప్రక్కింటి స్త్రీలవైపు ఓరకంటి చూపులుచూసే షోకేలా నన్నే ఎగా దిగా చూడసాగారు.

లోపల ఒక గదిలోకి తీసుకువెళ్ళాడు రాజా.

"ఇదే నే నుండేచోటు" అంటూ నవ్వుతూ కోటు విప్పుకున్నాడు రాజా.

రాజా ఆకారం, దుస్తులు చూడగానే నాకన్నా చాలా ధనికుడై ఎంతో పెద్ద భవనాలలో నివసిస్తున్నాడనుకున్నాను. కాని ఆదుర్గంధ పూరితమైన ఆ చిన్నగదుల్లో వుంటూండడం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. ఒకమూల సిగరెట్టు ముక్కలు, మరొకచోట బీరుసీసాలు, మరొకచోట పేక ముక్కలు. ఇంకొకమూల మాసిపోయి వేళ్ళాడే దుస్తులు, అన్నీ చిందరవందరగా పడిఉన్నాయి. ఆ వాతావరణం నాకు చాలా వెగటుగా తోచింది. ముఖంచిట్లించుకుని ముక్కు మూసుకున్నాను.

"ఇటువంటిచోట్ల ఉండడం నీకుముళ్ళమీద కూర్చున్నట్లుండవచ్చు. కాని యిల్లాంటి దుర్గంధ వాతావరణాల్లోనే కొన్ని కోట్లమంది యీ ప్రపంచంలో బ్రతుకుతున్నారు" అన్నాడు రాజా.

కాదని ఎవరనగలరు?

"ఒక్క నిమిషం ఓపికపట్టు; ముఖంకడుక్కుని వచ్చేస్తా. ఇటువంటి చోట నిన్ను కూర్చోపెట్టి ఎక్కువ బాధపెట్టను" అంటూ టర్కిష్ టవల్, సబ్బు చేత్తోపట్టుకుని బయటికి వెళ్ళాడు రాజా.

రాజా జీవితం గురించి పరిపరివిధాల ఆలోచనలు తలలో తిరిగి పోయాయి. ఇతనిలోని మార్పు మంచికో చెడ్డకో నాకు అర్థంకాలేదు. రాజా ఐదునిమిషాలలో దుస్తులువేసుకొని తయారవగానే, ఇద్దరం టాక్సీ ఎక్కి పబ్లిక్ గార్డెన్సుకుపోయి కూర్చున్నాము.

"అసలు ఎందుకు వెళ్ళిపోయావు రాజా ఆరోజురాత్రి?"

"చెప్పమంటావా?" నవేడు రాజా.

"నాకుచాలా ఆశ్చర్యం వేసింది. మనవాళ్ళందరూ నువ్వు బ్రతికున్నావో లేదో అంటున్నారు."

"అలా అనుకోడం అందరికీ శ్రేయస్కరం"

"అసలు నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పనేలేదు"

"ఇంతకాలం తర్వాత అది చెపితే దానివిలువ ఏముంటుంది?"

"విలువకోసం గాదు, నాకోసం"

"అయితే నీకోసమే ఒంటరిగా వెళ్ళిపోయాను"

"ఏం?"

"నీకు అనసూయను పెండ్లిచేసుకోవాలని ఉంది" నేను లేకపోతే నీపెళ్ళి అవడానికి అవకాశాలెక్కువ వున్నాయి. అందుకే పెళ్ళి నన్నాహాలన్నీ చేసేక నే తప్పుకుంటే ఆలగ్నానికి నీకు తప్పకముడివేస్తారనే సంకల్పంతో హఠాత్తుగా అదృశ్యమైయ్యాను,"

'అది నిజమయితేపోనీ పెళ్ళి అయినాక కనిపించవచ్చుగా'

'కనిపించవచ్చు. కాని కనిపించడం యిష్టంలేకపోయింది'.

జేబులో సిగరెట్టు దీసి నిప్పుముట్టించాడు. అనసూయ అంటే నాకుఎంతో అభిమానం. కాని నాకుపెండ్లి అంటే మనస్కరించలేదు. నేను చిన్నప్పటినుంచీ అనేక కుటుంబాలు చూస్తున్నాను. జీవితంలో లక్ష్యాలులేక పెద్దలు చెప్పినట్టుగా ఏదో అమ్మాయిని ముడిపెట్టుకుని జీవితం సంకుచితం చేసుకుని కూపస్థమండూకాలలా బ్రతకడం మనకలవాటయిపోయింది. వ్యక్తితన పరిస్థితుల ననుసరించి జీవితం దిద్దుకోవాలి. అవసరం అర్థంలేని, సంఘ నియమాల పరిధులుగీసుకొని అందులోనే సతమతమౌతూ, ప్రపంచమంటే ఏమిటో తెలుసుకోకుండా విజ్ఞానులమని విర్రవీగుతూ మూర్ఖత్వంతో మనమంతా సంచరించు తున్నామనిపించేది.

విశాలమైన ఆకాశం, అనంతమైన ప్రకృతి, హాయిగా ఎగిరే పక్షులు చూడగానే, పక్షిలా విహరిస్తూ ప్రపంచాన్ని చుట్టివేయాలనిపించింది. నాల్గెకరాల మాగాణిభూమి, అనసూయలాంటి భార్య, బి. ఏ. డిగ్రీ ఇవే జీవితంలో పొందవలసిన పరమావధులు కావనే నిర్ణయానికివచ్చాను. ఒంటరిగా బ్రతుకు లోతులు, ప్రపంచ రహస్యాలు కనుక్కోందామని బయలుదేరాను. ఈ పదేళ్ళల్లో నేపొందిన అనుభవాలు పరిశీలించుకుంటే నావలాయనం సఫలీకృతమైందని మాత్రం చెప్పగలను నేను ఆరోజు రాత్రి వెళ్ళిపోవడంవల్ల నాకోరిక ఈడేరింది. నేను ఆశించినట్లుగానువ్వు అనసూయను భార్యగా పొందగలిగావు!

పొగలు పదలుతూ కాల్చేసిన సిగరెట్టుబూది వేలితో దులిపేదు రాజా,

“చేతిలో పదిరూపాయలతో రాత్రి చలితో కట్టుబట్టలతో రైలు ఎక్కాను. చెమటలుకారుతూ జిడ్డుముఖాలతో క్రిక్కిరిసిపోయి అవస్థ పడుతున్న జనంగుంపులు ఆరైల్లో దీపాలమధ్య, ఎగ్జిబిషన్‌లో అమర్చిన వింత మనుష్యుల్లా మెరుస్తున్నారు. కనిపించిన వాడితో మాట్లాడాను. కష్టసుఖాలు కనుక్కున్నాను. రైలు తీసుకువెళ్ళినంతదూరం వెళ్ళాను. డబ్బు అయిపోయేదాకా మామూలుగా తిన్నాను. ఒక్కొక్కసారి మొక్కజొన్నలుతిని, నీళ్ళుత్రాగి, మాసాలుగడిపాను. టిక్కట్టులేకుండా ప్రయాణంచేసినందుకు లాకప్ చేశారు. పట్టుబడి జైలులో ఉన్నాను కొన్నాళ్ళు. పేక, జూదం, గుర్రపు పందాలు, లాటరీలు, బోగం కొంపలు, త్రాగుడు, వీటి అన్నింటిలో ప్రావీణ్యం సంపాదించాను. విచిత్రమైన అనుభవాలుపొందాను. జీవితంలోవిస్కు Risk తీసుకుని, పందెంలో ఒడ్డినట్లు, దాన్ని నిర్లక్ష్యంచేస్తే అదృష్టం లభించకేంచేస్తుంది?”

అదొక తీవితో అయిపోయిన సిగరెట్టు పారేసి, మరొక సిగరెట్టు ముట్టించాడు రాజా.

"అంటే అవినీతిగా ప్రవర్తించావన్న మాట."

"ఇందులో అవినీతి ఏముంది? నీతినియమాలు మానవులు ఆవసరానవసరాల ననుసరించి సృష్టించుకుంటారు. ప్రపంచంలో పాపంలేదు. చేసినపని చేసేమని విచారిస్తేనే పాపం!"

రాజాలో వింత మనోనిశ్చయాలు ఏర్పడ్డట్లు అనిపించింది.

"అయితే యీ అవినీతి ప్రవర్తనతో నువ్వు ఎంత బాగుపడ్డావో చెబితే సంతోషిస్తాను."

"బాగుపడడమంటే ఏమిటి? పుష్కలమైన అనుభవాలు సంపాదించాను. ప్రపంచాన్ని అర్థంచేసుకున్నాను. ఆనందం, సుఖం, నాకు కరతలామలకం. తలుచుకుంటే నా ప్రావీణ్యంతో ఎంతడబ్బైనా సంపాదించగలను ఇంతకంటే బాగుపడ్డంఅంటే ఏముంది?"

'బాగుంది' అంటూ పెదిమవిరిచాను. రాజా జీవితం నన్ను నిరుత్సాహపరిచింది జిలుగుమనేఅతని కళ్ళఅద్దాల వక్రీకరణలో అతని కళ్లు మూసివున్నట్లు కనిపించాయి.

'సరే', లేరాజా! మన యింటికి వెడదాం. అనసూయనుకూడా చూద్దువుగాని? అంటూ రాజాను లేవదీశాను.

ఇంట్లో ఆడుగు పెట్టగానే అనసూయ రాజా ముఖంవైపు ఆశ్చర్యంతో కంగారుగా తేరిపారి చూసింది.

'జ్ఞాపకమున్నానా అనసూయా' మొదట పలకరించాడు రాజా.

నేను తేవ్వుతూ నుంచున్నాను. గుర్తుపట్టలేక అనసూయ కంగారు పడుతోంది.

"నేను రాజా!"

అనసూయ నోరు ఆవిలించి, ముఖంచిట్లించి, ఇక్కసారిగా వికసించిన పువ్వులా ఆనందం వెదజల్లుతూ నవ్వింది.

'రా కూర్చో' అంటూ గబగబా కుర్చీ వాల్చింది. ఎక్కడుంటున్నావు ఏమిటి అంటూ అనేక ప్రశ్నలువేసింది. చిన్ననాటి విషయాలు ఎన్నో చెప్పుకుంటూ ఆరాత్రి చాలాహాయిగా గడిపేశాం మేంముగ్గురం.

మర్నాడే రాజా వెళ్లిపోడానికి సన్నాహముయ్యాడు. 'ఎక్కడికి వెడతావు మాయింట్లో ఉండమన్నాం' నేనూ అనసూయాను. కానీ వినలేదు. 'మళ్ళీ కనిపిస్తానంటూ' వెళ్లిపోయాడు రాజా.

రాజా కనిపించినట్టు పేరిశాస్త్రి మామయ్యకు ఉత్తరం వ్రాశాను. మామయ్యవచ్చి రాజాను కలుసుకొన్నాడు. పెండ్లిచేసుకొని ఒక స్థిరమైన జీవితం అలవరచుకోమని బోధించాడు. వంశంలో లేని త్రాగుడు, జూదం, వ్యభిచారం యీలక్షణాలు నిరసిస్తూ, రాజాను మందలించాడు మామయ్య, రాజా వినలేదు. 'కుటుంబంలో చీడపురుగులా పుట్టావు పుండాకోరు!" అంటూ ఉగ్రుడై రుసరుస లాడుతూ వెళ్ళిపోయాడు మామయ్య. కాని ఇంతకాలం కూడబెట్టిన రాజా ఆస్థిలో ఒక్క కానీ కూడా యివ్వలేదు మామయ్య.

"మంచివాడు అలవాట్లు మార్చుకున్నా ఎప్పుడూ మంచివాడుగానే ఉంటాడు. చిన్నప్పుడు మంచివాణ్ణి అయితే పెద్దయ్యాక చెడ్డవాణ్ణి ఎందుకౌతాను? గుణానికి అలవాట్లకి చాలాతేడా ఉంది" అంటూ

గొణుక్కున్నాడు రాజా. మధ్య నేనేమనగలను? కాని రాజాతో స్నేహంమాత్రం మానదలుచుకోలేదు.

నేనున్నా లేకపోయినా అప్పుడప్పుడు రాజా వచ్చి మాయయ్య యోగక్షేమాలు అనసూయను కనుక్కునేవాడు. ఒక్కొక్కసారి తాగి తందనాలాడుతూ యింటికివచ్చినా ఎవరికీ ప్రమాదంకలిగించకుండా వెళ్ళిపోయేవాడు.

నాకు జీవితంలో ఆర్థిక సమస్యలు మించిపోతున్నాయి. నాజీతం నాసంసార పోషణకు చాలటంలేదు. నాన్న చనిపోయి రెండేళ్ళయింది. అమ్మని, చదువుకుంటూన్న తమ్ముళ్ళిద్దరినీ పోషించేభారం నానెత్తిన పడింది. నాకున్న ఐదెకరాలు మెట్టభూముల ఆదాయం ఒకనెల తిండికి కూడా మాకు సరిపోవడంలేదు. ఇల్లావుండగా అనసూయకు గర్భవతిగా నవమాసాలూ నిండాయి. పురుడుకు హాస్పిటలులో చేర్చాను. చేతిలో డబ్బులేక అల్లాడుతున్నా. రాజా కనిపిస్తే ఏమన్నా సహాయం చేయగల్గుతాడా అనే ఆశతో అతనికోసం తిరిగాను

ఒకరోజు తాజ్‌మహల్ హొటలుదగ్గరే తిరిగి కనిపించాడు. ఇద్దరం మస్తుగా ఫలహారాలు చేసి బయటికివచ్చాం.

'ఒక కానీ ధర్మంచేయండిబాబయ్యా పిల్లలు గలవాణ్ణి' అంటూ ముష్టివాడు రాజావెంట బడ్డాడు అతని హొదాదుస్తులు చూసి.

"అంత తిండికి డబ్బులేనివాడవు, పెళ్ళిచేసుకుని, పిల్లలు కనమని ఎవరుచెప్పారోయి" అంటూ కసిరాడు రాజా.

ఆ మాట అకస్మాత్తుగా నామీదదెబ్బతీసినట్టయింది. రాజా సహాయం అడగనా లేదా అనే సందిగ్ధంలో పడ్డాను.

"ఏదో కనికరించాలి బాబయ్యా! దయచూపండి బాబయ్యా" అంటూ ముష్టివాడు వెంటబడ్డాడు.

"షో షో" అంటూ గదిమాడు రాజా. నిరాశతో మరలిపోయాడు ముష్టివాడు. పోయే ముష్టివాడివైపు నవ్వుతూ చురచురచూసి, తిరిగి పిల్చాడు రాజా. ముష్టివాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు వాడి చేతిలో పదిరూపాయిల కాగితం విసిరాడు రాజా. ఆనోటు చేత్తో పట్టుకొని, కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవిచేసి, నోరు ఆవలించి, కొన్నివేలు దండాలు పెడుతూ, రాజాను వెనక్కి వెనక్కి చూస్తూ వెళ్ళిపోయాడు ఆముష్టివాడు. ఈ దృశ్యం చూడగానే రాజా నాకుకూడా తప్పక ధనసహాయంచేస్తాడనే ధైర్యంకలిగింది.

"రాజానువ్వేమీఅనుకోకపోతే ఒకవిషయం అడగాలని ఉంది"

"చెప్పు"

"అనసూయ ప్రసవిస్తోంది, హాస్పిటలులో చేర్చాను. ఏమన్నా డబ్బు సహాయం కావాలోయి" అన్నా మెల్లిగానొచ్చుకుంటూ.

నాకేసి చురచుర చూసి నవ్వాడు రాజా.

"ఎంత కావాలి?"

"ఒకయేభయి రూపాయిలుంటే ప్రస్తుతం చాలు!" తక్షణం రాజా పర్సుతీసి చేతిలో పెట్టాడు వందరూపాయిలు"

ముష్టివాడి ఆ నం దా ని కి వెయ్యిరెట్లు మించిపోయింది నా అనుభూతి.

"వీలైనంత త్వరలోనే అప్పుతీర్చేస్తా" అన్నాను కృతజ్ఞతతో "అప్పుగా యివ్వలేదు. అనసూయకు బహుమతి" అంటూ నవ్వాడు రాజా.

అనసూయ ప్రసవించింది. తిరిగి ఆడపిల్ల, నాకు నిరాశ కల్గింది. అయినా ఈవార్త చెబుదామనుకున్నా. రాజా కన్పించలేదు రెండు రోజులుదాకా. ఈలోపుగా నాజీవితచంద్రుడికి గ్రహణం పట్టింది. ఆఫీసులో నాఆధీనంలోఉన్న పదివేలరూపాయిలు అకస్మాత్తుగా అదృశ్య మైనాయి. పట్టపగలు అందరం పనిచేస్తుండగా యిది ఎల్లా జరిగిందో నాకు తెలియలేదు. మాఆఫీసు యజమానులు నామీద దొంగతనం మోపారు. నన్ను పోలీసులు జైలులోపెట్టారు కేసు విచారణ చేస్తా మంటూ.

వారంరోజులు గడిచాయి. పోలీసులు నన్ను విడిచిపెట్టడం, రాజా ప్రక్కనేవుండడం చూచి పరిస్థితి కొంతవరకు అర్థంచేసుకున్నాను. రాజానే దొంగిలించేనన్న సొమ్మంతా చెల్లించాడు. రాజాకు నేనేంచేస్తే అతని ఋణం దీర్చుకుంటానో నాకర్థంకాలేదు. అసలు అతనికాడబ్బు ఎక్కడిదో!

నన్ను తిన్నగా కారులో కూర్చోపెట్టి బంజారాహిల్సుకు తీసుకు వెళ్ళాడు. అక్కడ పెద్దభవనం కొండలమధ్య ఎత్తువల్లాలతో కట్టబడి ఉంది. చుట్టూ అందమైన తోట, లోపల చలవరాయి నేల, అందమైన కిటికీలు, రంగురంగుల సోఫాలు నాకళ్ళు చెదిరిపోయాయి.

"ఎవరి యిల్లు యిది రాజా?"

"నాదే" అన్నాడు రాజా నవ్వుతూ, ఇంతలో మా అమ్మాయిలు యిద్దరు నాకాళ్ళు చుట్టుకున్నారు, అల్లరి చేస్తూవచ్చి. అనసూయ క్రొత్త బిడ్డను చేతుల్లో అదుముకుంటూ ఎదురుగావచ్చి నుంచుంది నవ్వుతూ. సంతోషంతో పిల్లనెత్తుకున్నాను. నాఆనందం పౌర్ణమినాటి సముద్రపు అలలా దూకుడుతో పొంగిపొర్లింది.

"మీ అమ్మాయి బారసాల రేపు. సన్నాహాలన్నీ చేయించాను" అన్నాడు రాజా.

విచిత్రమైన అనురాగంతో రాజానుకౌగిలించుకున్నాను. మర్నాడు బారసాలలో మాఅమ్మాయికి రాజా జ్ఞాపకార్థం రాజేశ్వరి అనిపేరు పెట్టుకున్నాను. ఎవరో పెద్ద పెద్ద వాళ్ళంతా కార్లల్లో వచ్చారు విందుకు. భోజనాలు పూర్తి అయ్యాయి, అతిథులు వెళ్ళిపోయారు.

తాంబూలం వేసుకుని, సిగరెట్టు త్రాగుతూ, "నీకోసం జాంబాగ్‌లో ఒక బట్టలకొట్టు తెరిపించాను. అందులో ఒక అరలక్ష పెట్టుబడి ఉంది. ఈ ఇల్లు, ఆకొట్టు ఈరోజునుంచి నీఅధ్వర్యంలో జాగ్రత్తగా చూసుకో! అన్నాడు నాభుజం తట్టుతూ రాజా.

"ఇంత డబ్బెక్కడిది రాజా?"

"పేకాట, జూదం, గుర్రప్పందాలు: మన్మత్తులకు డబ్బు ఘల్లున రాలుతుంది".

ఆసమాధానంనాకు సంతృప్తియివ్వకపోయినా, నమ్మక తప్పలేదు.

"నీఆదరణ మరిచిపోలేను రాజా!"

"మీ కూపస్థ మండూకం బ్రతుకులు చూశాను. ఇరుకు కొంపల్లో, దోమల తూముల దుర్గంధం పీలుస్తూ, చాలీచాలని తిండితో, చిరిగిన దుస్తులతో, ఎంతకాలం యీ హీనమైన బ్రతుకులు?"

"మరి నువ్వెందుకు ఆ చార్‌మీనార్ వద్ద ఆపాడైపోయిన ఇంట్లో వుంటున్నావు?"

"మిమ్మలిని బాగుచెయ్యాలన్న కోరిక నెరవేర్చడానికి...అయినా నేను అక్కడ ఉండేది నెలకొకసారి. పక్షిలా అనేకచోట్ల ఎప్పుడూ తిరుగుతుంటాను.

ఒక కుటుంబం భాగుపడితే ఒకడు నశించినా పర్వాలేదు. తరతరాలుగా పాతుకుపోయిన మనలో ఏఒకడైనా అభివృద్ధికివస్తే నాజీవిత లక్ష్యం సిద్ధించినట్లే! ఇప్పుడైనా హాయిగా బ్రతకవోయి, అంటూ దుస్తులు మార్చుకోడానికి రాజా తనగదిలోకి వెళ్ళిపోయాడు.

నాఅదృష్టానికి నేనభినందించుకున్నాను. నాకళ్ళవెంట ఆనంద భాష్పాలు జలజలా రాలాయి.

'నేవెడతాను' మళ్ళీ అప్పుడప్పుడు కనిపిస్తా, అంటూ దుస్తులు వేసుకొని బయటికివచ్చాడు రాజా. మాతోనే ఉండిపొమ్మని నేనూ. అనసూయ పట్టుపట్టాము రాజాను. మామాట రాజా వినలేదు. జేబురుమాలు ఆడిస్తూ, నవ్వుతూ, రాజా వెళ్ళిపోయాడు.

మర్నాడు పత్రికల్లోవచ్చిన వార్త నాగుండెలు బ్రద్దలుచేసింది. రాజాను ఖైదుచేశారు; నేను మునుపు పనిచేసే కంపెనీ మేనేజరును హత్య చేశాడని. పదివేల రూపాయిల దొంగతనం-మేనేజరు హత్య యీ రెంటికీ సన్నిహిత సంబంధం ఉందన్నారు అందరు.

రాజా నాకోసం ప్రతీకారం తీర్చుకున్నాడా అనిపించింది.

చేతిలో పుష్కలంగా ధనమున్నా రాజాను జైలునుంచి విడిపించడం నాకు సాధ్యంకాలేదు. కారణం, రాజా హత్యానేరం ఒప్పుకున్నాడు.

రాజాకు ప్రతిసహాయం చెయ్యలేని నన్నుచూసి మా తోటలోని పక్షులు రెట్టలు వేస్తూ, తమలో కలకల నవ్వుకున్నాయి హేళనగా.

# మామ్మ నడిపిన విప్లవం

పెళ్ళి పందిర వినూత్నమైన శోభతో ప్రకాశిస్తోంది. ఝరీచీరల తళుకుల ముత్తైదువులు, సిల్కు గౌనుల చిన్న అమ్మాయిలు, వాయిలు పమిటల కన్యలు; జలతారు కండువాల పెద్దలు, సిల్కు లాల్చీల యువకులు, పందిరలో కిటకిటలాడుతున్నారు. పెండ్లి కొడుకు, పెళ్ళికూతురు మెళ్ళో, జీవితం అంకితం చేస్తున్నట్లు, మూడుముళ్ళు వేస్తున్నాడు. బ్యాండువాడు చేసుకున్న కంట్రాక్టు ప్రకారం అనంతమైన శబ్దంతో పెళ్ళిపందిరను దద్దరిల్ల జేస్తున్నాడు.

అందరి దృష్టి ఆ క్రొత్త దంపతులమీద వాలింది, కల్యాణ మయిన వారందరికి పూర్వ స్మృతులు కలలుగా ఎదురుగా కనిపిస్తున్నాయి కన్యలు కాబోయే భర్తలను, బ్రహ్మచారులు కాబోయే భార్యలను ఊహించుకుంటున్నారు.

నిలుచుని చోద్యంగా దంపతులను చూస్తున్న ముత్తైదువుల గుంపులోంచి శేషమ్మ తడిబట్టతో త్రోసుకుంటూ ముందుకువచ్చింది. ముత్తైదువులలో కలకలం బయలుదేరింది.

"శేషమ్మత్తా! తడిబట్టతో యిక్కడ మధ్యన నుంచుంటే ఏం బాగుంటుందే! పెళ్ళి అయిపోయిందిగా! యింక చూసేదేముంది!" పెత్తనం వహించే ఒక పెద్ద ముత్తైదువ శేషమ్మను మందలించింది.

ముత్తైదువ మాటలు ములుకుల్లా గ్రుచ్చుకున్నాయి శేషమ్మకు. అందరూ పెళ్ళిపందిరలో ఏంచూస్తున్నారో! ఎక్కడ శుభంజరిగినా తాను

కనిపించడానికి వీలులేదనే శాసనం ఎంతకాలం ఓర్వడం! తనుమాత్రం అందరిలాగా మనిషికాదూ!

గాడిపొయ్యివద్ద తెల్లవారినప్పటినుంచి పెళ్ళికివచ్చిన బంధుబలగం భోజనాలకై గరిటె తిప్పుతున్న శేషమ్మకు ఒక్క నిమిషం ఊపిరిఆడే తీరిక లేకపోయింది. అయినా తీరిక చేసుకుని పెళ్ళిని కళ్ళతో చూడాలనుకుంటే, ముత్తయిదువులకు ఆటంకం! తనకూ ఒకసారి ఈవిధంగానే పెండ్లి జరిగింది. కాని విధి దుష్టమై, ఏడాది కాపురం పూర్తిగాకముందే భర్త గతించాడు. అపురూపమైన ఐదవతనం అంతరించిపోయింది. అందమైన శరీరం వికృతమైపోయింది.

శేషమ్మ ఒక్క నిట్టూర్పు విడిచింది. వడలిపోయి, వాడిపోయి, శుష్కించిన వదనం చెమట బిందువులతో నిండింది. గాడిపొయ్యి వేడి—వేసవి ఎండ—పెళ్ళి ప్రయత్నాలలో ఎడతెరిపిలేకుండా పదిహేను రోజులనుంచి చాకిరీ—శేషమ్మ శరీరాన్ని హూనం చేసింది. పెళ్ళి చూసి తాత్కాలికమైన ఆనందం పొందడానికి కూడ సంఘం దృష్టిలో ఆమె అర్హురాలుకాదు.

శేషమ్మ జీవితంలో ఏభయి అయిదు సంవత్సరాలు గతించాయి. భర్త చనిపోయేక వైధవ్యం ఆరోపించబడినాక, ఆమె జీవితం అంతా బంధుబలగం సేవలోదొర్లిపోతోంది. పెద్దల అధికారాలు, సృష్టించిన కట్టుబాట్లవల్ల ఏ బంధువుల ఇంట్లో ఏశుభం జరిగినా అక్కడ చెయ్యవలసిన చాకిరీకి శేషమ్మ హాజరు కావలసి వచ్చేది. శుభకార్యాలకు వందలు వేలు ఖర్చుపెట్టే యీ పెద్దలు, వంటకు, చాకిరీకికొద్దిరూపాయలు అదనముగా ఎందుకు ఖర్చుపెట్టలేరో ఆమెకు అర్థమయేది కాదు.

పెళ్ళికివచ్చిన పెద్దలంతా దంపతులమీద అక్షంతలు చల్లి ఆశీర్వదించారు. బ్యాండువాడు తన సందడి తగ్గించాడు. పురోహితులు ఉచ్చరించే మంత్రాలు గంభీరంగా పరీక్షచేస్తున్న సిద్ధాంతిగారు తన హడావడి తగ్గించుకుని, బోస్సినోరుతో ఆనందంగా, ఠీవిగా, తన పెద్దరికం ఋజువు చేసుకుంటూ, పెళ్ళిజనం వైపు కలయ చూసారు హఠాత్తుగా ఒక్కసారి కనుబొమలు ముడిచి చేతికర్ర ఊతతో లేచి నుంచుని ఒక్క అరుపు అరిచారు,

'నువెప్పుడు వచ్చావే పందిట్లోకి! లోపలికిపో! హాయిగా యిక్కడ శుభం జరుగుతోంటే నువ్వే ప్రత్యక్షమవ్వాలా? వెళ్ళు!.

సిద్ధాంతిగారి అరుపుతో శేషమ్మ భయపడుతూ అవమానంతో లోపలికి వెళ్ళిపోయింది. ఆయన అరుపు జనం అందరిలో చలనం కలిగించింది.

నా ప్రక్కనే కూర్చున్న రాజారావు ఆయన అరుపు విని కొంచెం విస్తుపోయేడు. 'ఎవరాయన!' అంటూ నా వైపు చూశాడు.

'రెండు రోజులు ఇక్కడ ఉండు. నీకే తెలుస్తుంది అంతా! అన్నాను. నవ్వుతూ!

రాజారావు నామాట వింతగా విని తనదృష్టి ఎదురుగా కనిపిస్తున్న డాబామీదకి పోనిచ్చాడు. లలిత మేడమీదనుంచి పెండ్లి చూస్తోంది. రాజారావు దృష్టిలో ఏదో ఆసక్తి కనిపించింది. నేను ఏమీ ఎరగనట్లు ఊరుకున్నాను.

పెండ్లి అయినాక భోజనాలకి ఆహ్వానాలు వచ్చాయి. అందరితో పాటు, నేనూ, రాజారావు, పంక్తిలో కూర్చున్నాం. రుచికరమైన

అనేకవస్తువులు వడ్డనచేశారు. బొజ్జలు పెరిగిన పెద్దలు శ్రోత్రియమైన గంధాక్షతలు పూసుకుని సుష్టుగా భోంచేస్తున్నారు. శేషమ్మ ఏదో కూరవడ్డనకు తెచ్చింది.

'మామ్మా! కులాసాగా ఉన్నావా!' అన్నాను.

'వచ్చావుట్రా! పెళ్ళికి వస్తావో రావో, దూరంగా ఉద్యోగంలో ఉన్నావు కూడ అనుకున్నాం అంతా!'' అంది ఆమె...వెళ్ళిపోతూ "ఆనక కనిపించు ఒకసారి'' అంది శేషమ్మ మామ్మ.

నిరాశ, నిస్పృహ, నిర్లిప్తత, తాండవిస్తున్న ఆ ముసలావిడ ముఖంలోకి చూడగానే రాజారావుకు చాలా జాలికలిగింది.

'ఎవర్రా ఆవిడ' ప్రశ్నించాడు.

జీవిత పద్ధతులలో మార్పులున్నా, భావాలలో ఏకీభవించడం వల్లనే రాజారావుకు, నాకు ఎక్కువ స్నేహం ఏర్పడింది. అందుకే మా బంధువుల యింట్లో పెండ్లి అనగానే రెండురోజులు గడుపుదామని బయులుదేరి నాతో వచ్చాడు రాజారావు. శేషమ్మ మామ్మపై నాకున్న అభిప్రాయంతో అతను ఏకీభవిస్తాడని నా ఉద్దేశం. ఆమె జీవితం గురించి క్లుప్తంగా చెప్పాను.

శేషమ్మ మాఅమ్మమ్మకు వదిన. క్రూరుడైన భర్తతో ఒక సంవత్సరం కాపురం చేసింది. పదహారవ ఏటనే భర్త చనిపోయేడు. అప్పటికి గర్భంతో ఉంది ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. పుత్రజననం జరిగాక ఆమెఅందమైన శరీరాన్ని పెద్దలు వికృతంచేసి శిరోముండనం చేసారు. ఆమె ఎంతో బాధపడి ఏడ్చింది తనఆకారం చూసుకుని. ఆమె బాధ ఎవరూ అర్థంచేసుకోలేదు. ఇంటిపెద్దలు, సిద్ధాంతిగారు, ఆమెకు అలా చెయ్యడం ధర్మం అని శాసించారు.

నాకు జ్ఞానంవచ్చినప్పటినుంచి చూస్తూనేవున్నాను. ఎవరో ఒకరి యింట్లో ఎప్పుడూ ఆమె చాకిరీ చేస్తూనే ఉంటుంది. ఆమె చేత చాకిరీ చేయించుకోడం బంధువులలో ఆచారమై పోయింది. మరోమాటలేకుండా మౌనంగా ఓరిమితో ఆమె యిలానే జీవితంగడుపుతోంది.

ఏదోవిధంగా కష్టపడి ఒక్కకొడుకుకు చదువు చెప్పించి, వృద్ధిలోకి తెచ్చి, పెండ్లిచేస్తే, గాజిబొమ్మలాంటి అందమైన భార్య ఆనందంలో మైమరచి, కన్నతల్లిని దూరంగా ఉంచాడు ఆ కొడుకు. ఎడారిలాంటి బ్రతుకులు గడిపే యీ మూగ వితంతువు జీవనం దుర్భరమనిపిస్తుంది మానవత్వమున్న ప్రతిమనిషికీ.

"భౌతిక జీవితాల అవసరాలు విస్మరించి, ధర్మశాస్త్రాల పేరుమీద పెద్దలుచేసే శరీరహింసలు ఎప్పటికి అంతరిస్తాయో!'' రాజారావు నిట్టూర్పు విడిచాడు.

భోజనాలు పూర్తయ్యాయి. హస్త ప్రక్షాళనాలు పూర్తి చేసారు అతిథులంతా, తాంబూలాలు అందాయి అందరికీ.

లలిత తలవంచుకుని ప్రక్కనుంచే వెళ్ళిపోతోంది.

ఆమెను పిలిచాను. తలవంచుకునే నిలబడింది.

'భోజన మయిందా?' అడిగాను.

'ఆ' నవ్వింది.

'ఈ పెళ్ళి హడావిడిలో నీతో మాట్లాడలేక పోయాను'.

మౌనంగా ఊరుకుంది.

'నీ కింతకష్టం యింత చిన్నతనంలో కల్గుతుందనుకో లేదు'.

ఆమెవదనం విచారమైంది.

ఒకక్షణం నిశ్శబ్దం.

'మళ్ళీవచ్చి నీతో మాట్లాడుతా!'

ఆమె వెళ్ళిపోయింది.

'పద రాజారావూ' అన్నా.

రాజారావు లలితవెళ్ళే వైపు దీర్ఘంగా చూస్తున్నాడు.

'నీకేమౌతుంది ఈ అమ్మాయి' అడిగాడు రాజారావు.

'మా పిన్నమ్మకూతురు చాలా తెలివైనపిల్ల, స్కూలుఫైనలు చదువు కుంది రెండేళ్ళక్రితం భర్త పోయేడు మశూచివల్ల అకస్మాత్తుగా.'

'నయం. ఈమెనుకూడా వికృతంగా చెయ్యలేదు మీ బంధువులు'.

'అందుకు మా శేషమ్మ మామ్మ కారణం. ఆవిడ పట్టుబట్టి శిరోముండనం ఆపించింది'.

'మళ్ళీ పెళ్ళి చెయ్యకూడదోయి ఆ అమ్మాయికి.'

'మళ్ళీ పెళ్ళి! అది మావంశాల్లో లేదు. గట్టిగా అన్నావుకనుక, సిద్ధాంతిగారు మీదపడి అరవగలడు!' అన్నాను.

రాజారావు నవ్వాడు.

తరువాత ఒక కునుకు తీసి లేచి కూర్చున్నాం రాజారావు నేను. పెళ్ళివారు ఫలహారాలు పంపించారు. అవి తిని కాఫీ త్రాగాం.

'మళ్ళీ శరీరంలో క్రొత్త శక్తి వచ్చిందోయి' అన్నాడు రాజారావు ఒళ్ళు విరుచుకుంటూ.

సిద్ధాంతిగారు గుమ్మంలోంచి వెడుతూ నన్ను చూసి ఆగారు.

'రా తాతయ్యా!' అన్నాను.

'ఏరా! కులాసాగా ఉన్నావా. మీ ఆవిడకూడ వచ్చిందికదూ!

'వచ్చింది. పిల్లలుకూడా వచ్చారు'.

'ఈయన ఎవరు?' రాజారావువైపు తీవిగా చూసారు సిద్ధాంతిగారు. నిర్భయంగా, నిర్లక్ష్యంగా అతను సిగరెట్టు త్రాగడం బాగానిరశిస్తున్నట్లు.

'అతను మా స్నేహితుడు'

'ఉద్యోగమా!'

'ఆఁ మా ఆఫీసులోనే ఒక అయిదువందలు యిస్తారు.'

'పిల్లలా?'

'పెళ్ళి యింకా కాలేదు.'

'అదేమండి. ముప్ఫయి ఏళ్ళువచ్చినా పెళ్ళి చేసుకోలేదు!'

"అది నా స్వంతవిషయం. మీవిషయం కాదనుకుంటా" రాజారావు నిర్లక్ష్యంగా సమాధాన మిచ్చాడు.

"మంచిది!" ఏమనలేక ఒక గుటక మ్రింగారు సిద్ధాంతిగారు. ఇంతలో నా భార్య పిల్లలు లోపలికి వచ్చారు.

"ఏమే శశీ! జ్ఞాపకం ఉన్నానే!" సిద్ధాంతిగారు బోసి నవ్వుతో నా భార్య వైపు చూశారు.

"జ్ఞాపకం లేకేమండి"

"ఎంత మంది పిల్లలు"

"ముగ్గురు"

మా పెద్దమ్మాయి, అయిదేళ్ళపిల్ల గెంతుకూ నా దగ్గర వచ్చింది.

"నీ పేరేమిటే!" సిద్ధాంతిగారు మాఅమ్మాయిని దగ్గరకుపిలిచారు.

"లీల"

"ఏం చదువుకుంటున్నావు!'

"ఒకటవ క్లాసు"

"ఊఁ. బలే అందంగా ఉన్నావే!" అంటూ మా అమ్మాయిని ముద్దుపెట్టుకున్నారు సిద్ధాంతిగారు.

"ఛఛ" అని ఈసడించుకుంది మాఅమ్మాయి.

"నన్ను పెళ్ళిచేసుకుంటావుటే!" సరసాలాడారుసిద్ధాంతిగారు.

'ఊహు నీకు పళ్ళులేవు, అని నవ్వింది మాఅమ్మాయి. 'పెళ్ళి చేసుకుందికి పళ్ళే ఉండనక్కర్లేదే! చలోక్తి విసిరారు సిద్ధాంతిగారు. 'బాగున్నారే! నీ పిల్లలు!' అంటూ నా భార్యవైపు చూశారు ఆయన.

'వస్తానయ్యా! యింకా ఉంటావుగా!' సిద్ధాంతిగారు లేచారు.

'మంచిది మళ్ళీ కలుసుకుంటా' అన్నాను.

సిద్ధాంతిగారు వెళ్ళిపోయారు.

నా భార్యాపిల్లలు, బట్టలు మార్చుకుని బయటికి నడిచారు.

'అరవై ఏళ్ళ ముసలివాలకం వచ్చినా మాటల్లోయావన మదం పోలేదు.' అన్నాడు రాజారావు సిద్ధాంతిగారి నుద్దేశించి!

"ఆయన తత్వమే అంతలే! చిన్నప్పుడు నా భార్యను కూడా యిలాగే అనేవాడుట 'నన్ను పెళ్ళి చేసుకుంటావా' అని"

"పెద్దలు కనుక, నీతి నియమాలు లేకుండా సరసంగా మాట్లాడ వచ్చు. తప్పులేదులే" వ్యంగ్యంగా నవ్వాడు రాజారావు.

మేమద్దరం, సాయంత్రం షికారు బయలుదేరి మాపిన్నమ్మగారి యింటికి వెళ్ళాం. శేషమ్మ మామ్మ, లలిత, పిన్నమ్మ, మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

మ మ్మ ల్ని చూ సి, లలిత రెండు కుర్చీలు తెచ్చి వసారాలో వేసింది. కూర్చున్నాం. మాపిన్ని ఏవో సంసార గొడవలు చెబుతోంది. లలిత దూరంగా నుంచుంది. రాజారావు లలితవైపు దృష్టి లగ్నం చేసేడు ఓరగా.

లోపలనుంచి ఖంగుమంటూ దగ్గు వినిపించింది. ఊపిరాడకుండా అరగంటసేపు గిలగిల బాధపడింది ఆవ్యక్తి దగ్గుతూ.

'ఎవరు?' అడిగాను.

'మాఅమ్మ' శేషమ్మ మామ్మ నీరసంగా పలికింది.

'ఆవిడ ఉబ్బసరోగం అలాగే వుందన్నమాట ఈ పదిసంవత్సరాల నుంచి!'

'అదిమాత్రం తగ్గలేదు. ఎనభైఏళ్ళువచ్చిన యీవయస్సులో ఉపద్రవమైనదగ్గుతో ప్రతిరోజూ చావుబ్రతుకులమధ్య గడుస్తోంది ఆవిడకు. కాని చాకిరీచేసే మాలాంటివాళ్ళకి నిత్యమూ చావుమాత్రమే కనిపిస్తోంది.' బాధతో కన్నీరు పెట్టుకుంది శేషమ్మమామ్మ.

'నిన్ను చూస్తే నిజంగా జాలివేస్తుంది మామ్మా' అన్నాను.

'దానివల్ల ప్రయోజన మేముందినాయనా. నాజీవితంలో ప్రతి నిముషం బాధే! ఆయన పోయినరోజుల్లో అనుకునేదాన్ని ఒక పంతులమ్మ పని చూసుకుని బ్రతుకుతే బాగుంటుందేమోఅని. మనవాళ్ళు ఒప్పుకుంటేగా! గాడిదల్లా పనచేయించుకుందుకు యీనైను పంచకప్పారు నామీద. అప్పుడే పంతులమ్మపని చూసుకుంటే నాకీబెడద, బాధ, చాకీర్, అన్నీ తప్పేవి.'

గతించిన జీవితంలో త్రొక్కిన తప్పుదారులకు శేషమ్మ మామ్మ పశ్చాత్తాపపడుతోంది. నాచిన్నతనంలో చిన్న చిన్న ఇంగ్లీషుమాటలకు

అర్థాలు, కథలూ చెప్పేది మామ్మ. ఆమె చాలా తెలివైనదనీ అందరూ అంటూఉండేవారు. ఎంత తెలివి ఉంటేనేం! అదిసరిగా వినియోగించుకో లేకపోతే జీవితగతులు యిలాగే మారిపోతాయనిపించింది.

పోనీ, మీ అమ్మతోవెళ్ళి నీకొడుకుదగ్గర ఉండకూడదమ్మా!' అన్నాను.

'ఈ ముసలి దగ్గమనిషిని చూస్తే వాడికి చెప్పలేనిరోత. పైగా ఈవిడ ఉన్న ఆస్తి కొడుక్కు అప్పచెప్పింది. కోడలు దగ్గరికిరానీయదు. కొడుకు లెక్కచెయ్యడు. అందుచేత కూతుర్ని కనుక, అందులో భర్త లేని కూతుర్ని కనుక, ఈమెను నేనేభరించవలసివస్తోంది. కానీకూడ కొంగునుంచిదులపని ఈ ముసలిదానికి చాకిరీ చెయ్యవద్దు అని నాకొడుకు అంటాడు. ఎల్లాగా యీ ముసలితల్లిని వదిలివెళ్ళేది!' అంతబాధలో మానవత్వం కనబరుస్తున్న ఆ వ్యధిత వితంతువులో ఔదార్యం మూర్తీభవించింది.

'పాపం! దాని బ్రతుకంతా బాధే!' అంది పిన్నమ్మ. శేషమ్మ మామ్మ దుఃఖం ఆపుకోలేక ఏడ్చింది. 'చూడరా! నా బ్రతుకు యిలా వుందని తెలిసికూడా, లలితను నాలాగే చేద్దామనుకుంటున్నారు. దానికి మళ్ళీ పెళ్ళిచేస్తే తప్పేముందిరా?' ఆమాటకు ఎవరూ సమాధానమియ్యలేక మౌనం వహించారు.

మరోనిమిషముండి నేనూ రాజారావు బయటికి వచ్చేశాము. వీర్రాజు చుట్టకాలుస్తు వీధి అరుగుమీద కూర్చున్నాడు ప్రక్కయింట్లో. ఆతనికి నాకూ ఎక్కువస్నేహం లేకపోయినా, బాగా ఎరుగుదును.

'ఒరేయి! ఎప్పుడొచ్చావురా! కులాసాగావున్నావా?' అన్నాడు వీర్రాజు.

సన్నగా, రివటలా మారిపోయిన వీర్రాజును మొదట గుర్తుపట్టడం కష్టమయింది. 'సంసారి అయ్యాక చాలా మారిపోయాడే' అనుకున్నా.

ఇంట్లో గుమ్మంలోంచి అతనిభార్య నాకేసి తొంగిచూస్తోంది. అయిదడుగుల వెడల్పుఉన్న ఆగుమ్మంలో ఆమెఆకారం నిండుగా కనిపించింది. వేళాకోళంగా నవ్వుకున్నాను వీర్రాజు ఎందుకు చిక్కి-పోతున్నాడో అర్థంచేసుకుని.

'లోపలికి రారా!' అన్నాడు వీర్రాజు.

నేనూ రాజారావు లోపలి వసారాలోంచి మేడమీదికి వెడుతున్నాం.

ప్రక్క-గదిలో సిద్ధాంతిగారు ఠీవిగా పీటమీదకూర్చుని మిఠాయి తింటున్నారు. వీర్రాజు తల్లి, రుద్రాక్షలు ధరించిన సనాతన వితంతువు. సిద్ధాంతిగారికి విసనకర్రతో విసురుతోంది. సిద్ధాంతిగారు బోసినవ్వుతో ఏదో చలోక్తులు విసురుతున్నారు.

'ఆ ముసలి సిద్ధాంతి యిక్క-డ ప్రత్యక్షమయ్యే డేమిరా?' రాజారావు నసిగాడు నాచెవిలో.

"అది ఆయనకు అలవాటే! మడి, ఆచారం, లేనిచోట సిద్ధాంతిగారు ఉండరు వితంతువులు మడిగా ఉంటారు కాబట్టి అక్క-డికే చేరుతాడు ఆయన" వ్యంగ్యంగాఅన్నా, వీర్రాజు వినకుండా.

రాజారావు అర్థంచేస్తుకున్నాడు.

వీర్రాజుతో కాస్సేపు మాట్లాడి, చిన్ననాటి విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొని ఆనందించాను నేను.

'ఒరేయ్! పెద్దవాడవు, గొప్పవాడవు అయిపోతున్నావు మరిచి పోకేం!' అన్నాడు వీర్రాజు వీడ్కోలిస్తూ.

'అది అసంభవం' అంటూ నడిచి వచ్చేశాను.

సాయంత్రం చల్లగాలి బాగావీస్తోంది. గృహాంగణంలో గృహిణులు అలంకరించుకొని మల్లెపూలచెండుల వాసనలుజిమ్ముతూ వచ్చే వెళ్ళే జనంవైపు చూస్తూ ఆఫీసునుంచి వచ్చేభర్తలకై ఎదురుచూస్తున్నారు. మా పెళ్ళివారి యింట్లో రాత్రి దంపతుల శోభనానికి అన్ని హంగులు చేస్తున్నారు.

'నువ్వు మాట్లాడవలసిన బంధువులు యింకా ఉన్నట్టున్నారు. మాట్లాడుతూఉండు. నేను అలావెళ్ళి వూరంతా చూసివస్తా' అన్నాడు రాజారావు నవ్వుతూ.

రాజారావు నవ్వులోని అంతరార్థం నాకర్థమయింది. ఒంటరిగా జీవిస్తున్న అతన్ని సాయంత్రమవగానే ఒంటరిగానే వదలివేయవలసిన బాధ్యత గుర్తించాను. రాజారావు వూళ్ళోకి వెళ్ళిపోయాడు.

శోభనం గది రాత్రి చాలా అందంగా అలంకరించారు. ముత్తైదువులు గుమిగూడారు. మధురమైనకంఠంతో ఇంటివారికోడలు జయదేవుడి గీతాలు ఆలపించింది. సంగీతం నేర్చుకుంటున్న ఒక పాప జోలపాట పాడింది. గది అంతటా వెదజల్లబడిన మల్లెపూల పరిమళం అందరినీ మత్తులోముంచి తేల్చుతోంది. గత స్మృతుల మాధుర్యము నెమరు వేసుకుంటున్నారు మూలఒరుగుతున్న ముసలి పెద్దలు. ముత్తైదువుల మధ్యనుంచి నా భార్య నవ్వుతూ నావైపు చూసింది. క్రొత్త దంపతులు

తాంబూలాలు పాత దంపతులకు పంచిపెట్టారు. కన్నీరుతుడుచుకుంటూ ఒకమూల లలిత విచారంగా నుంచుని చూస్తోంది ఆ దృశ్యం.

సిద్ధాంతిగారు తాంబూలం అందుకుంటూ బోసి నవ్వుతో బుజాలు ఎగరేస్తూ ఏదోలీలగా హాయిగా ఆలోచిస్తూ బయటికి నడిచారు. నన్ను చూసి ఒక క్షణం ఆగి 'మీ స్నేహితుడేడోయ్!' ప్రశ్నించారు.

'ఊరు చూద్దామని బయటికి వెళ్లాడు.'

'తిరిగి రాత్రి యింటికి వస్తాడా?'

'రానని మీతోచెప్పాడా తాతయ్యా!' ఎదురుప్రశ్న వేశాను.

'అదికాదులే, చాలా పొగరుబోతులా కనిపిస్తున్నాడు నీకూ వాడికీ స్నేహం ఎలాకుదిరిందోకాని.'

"పైకి అలాకనిపించినా, అతడు చాలామంచివాడు తాతయ్యా!"

'అది నువ్వుచెప్పాలా! తెలుస్తోనేవుందిగా! ముప్పైఏళ్ళదాకా పెళ్ళిచేసుకోని మనిషిలో గృహస్థధర్మాలు, మర్యాదలు మచ్చుకైనా ఉంటాయని ఎవరనుకుంటారులే!'

"పెళ్ళికీ గుణానికీ సంబంధంలేదు తాతయ్యా! గుణంలేని గృహస్థులూ ఉన్నారు. గుణమున్న బ్రహ్మచారులూ ఉన్నారు. అతడు బ్రహ్మచారి అయినా గృహస్థుడికంటె అనేక నీతి నియమాల్లో చాలారెట్లు మంచివాడు."

"చాల్లేరా! వాడి వాలకం చూస్తూంటేనే తెలుస్తోంది ఎటువంటి వాడో ఏకిరస్తానీవాళ్ళతోనో గడిపేరకం!"

"అది చాలాతప్పు అభిప్రాయం తాతయ్యా!" అన్నాను.

ఇంతలో నా భార్య ఎందుకో పిలిచింది. ఆ సంభాషణ ఆగి పోయింది; అంతటితో.

రాత్రి రెండు గంటలయింది. క్రొత్త దంపతుల గదిలోంచి గుసగుసలు వినిపిస్తున్నాయి. కిటికీ సందులోంచి వెలుగులు కనిపిస్తు న్నాయి. నిద్రరాక, ఏమీతోచక సిగరెట్టు వెలిగించి డాబాపై పచార్లు చేస్తున్నాను.

రాత్రి రాజారావు ఇంటికి రాలేదు. ప్రొద్దున్నే పళ్ళు తోముకుంటూంటే ప్రత్యక్షమయ్యాడు అతను. మామూలుగా ప్రొద్దున్న కాఫీ ఫలహారాలు పూర్తయిపోయాయి.

"మావాళ్ళు పట్టుపడుతున్నారు ఉండమని. మరోవారం ఇక్కడ ఉండ వలసివస్తోందోయి" అన్నాను, రాజారావుతో.

'సరే మంచిదే! నేనుకూడ సెలవు పొడిగిస్తాను. ఈలోగా చుట్టు ప్రక్కలఉన్న చారిత్రక స్థలాలు చూసివస్తా 'అన్నాడు రాజారావు'.

ఆ వారం రోజుల్లో రాజారావు చుట్టుప్రక్కల గుళ్ళు, గోపురాలు అనేకం చూస్తూరాత్రి యింటికి వచ్చేసేవాడు. తర్వాత మేమేవో కబుర్లు చెప్పుకుని పడుకునే వాళ్ళం.

"క్రొత్తదంపతులు ఎలావున్నారోయి" అడిగాను ఒకరోజు.

"ఈడూ జోడూ బాగానే వుంది. కాని ఇది పెద్దలు చేసిన పెళ్ళా? వాళ్లు చేసుకున్నదా?" అడిగాడు రాజారావు.

"పెద్దలే నిశ్చయించారు. దంపతులు దగ్గరి బంధువులైనా, చిన్న వ్పటి నుంచి ఒకరినొకరు ఎరిగున్నా, ఎప్పుడూ మాట్లాడుకోలేదు; కాదు మాట్లాడుకో నివ్వ లేదు పెద్దలు"

"తెలివి తేటల్లో తమను మించిపోగలరేమో అని పెద్దల భయం కాబోలు—లేకపోతే ఇంత అనవసరమైన వేలరూపాయలు ఖర్చులేకుండా ఒంటరిగా ఎక్కడైనా పెళ్లి చేసేసుకుంటారేమో అని భయంకలిగి ఉండవచ్చు!'' వ్యంగ్యంగానన్నాడు రాజారావు. "అంతే'' అన్నా.

''తమ జీవితాల బూజులు దులుపుకోలేని పెద్దలు ఇంకొకరి జీవితాలు దిద్ద పూనుకోవడం గర్హించదగిన విషయం'' అన్నాడు రాజారావు తీవ్రంగా.

'గతం గురించి విచారిస్తే ప్రయోజనం లేదు, ప్రస్తుతం అలోచించాలి నేను రేపు వెళ్లిపోతున్నా ' అన్నాడు రాజారావు ఏదో అలోచిస్తూ, సిగరెట్టు పీలుస్తూ!

పరధ్యాన్నంగా అన్నాను ''అలా గేలే!'' అని

మర్నాడు రాజారావు వెళ్ళిపోయాడు. అతను వెళ్లిపోవడంవల్ల కలిగిన విరామం నా ఆనందానికి అవకాశమిచ్చిందని సంతోషించాను.

నా సెలవు మరో రెండురోజులు పొడిగించాను.

మర్నాడు మధ్యాహ్నం మా పిన్నమ్మ వచ్చింది నా దగ్గరికి హడావుడిగా!

'ఒరే! లలిత కనుపించటము లేదురా నిన్న రాత్రినుంచి!' అంది పిన్నమ్మ! ఆమె ఆత్రుత నాకు మొదట అర్థంకాలేదు.

సిద్ధాంతిగారు యీ సంగతివిని తోక త్రొక్కిన త్రాచులా మా యింట్లో వాలారు.

'నేను అంటూనే వున్నాను. ఏమైపోతుంది? ఆ రాజారావు లేవదీసుకు పోయాడేమో! అప్రతిష్ట తెచ్చే పీనుగు!'' పళ్ళు లేకుండానే ఇగుళ్ళతో పట పట కొరికారు సిద్ధాంతిగారు.

నానోట మాటలేదు.

మరోరోజు గాలించాం, లలితకోసం. ఎక్కడా కనుపించలేదు. రాజారావు వెళ్లిపోయిన రెండురోజులకు లలిత కనుపించలేదు. అతను ఎప్పుడూ ఆమెతో మాట్లాడినట్లు కూడా లేదు. రాజారావు యీపని చేశాడని అనుకోడానికి నాకు అస్కారం లేకపోయింది.

సిద్ధాంతిగారు రుద్రుడులా, కాలయముడిలా యింట్లో నృత్యము చేస్తున్నారు. నామీద చెప్ప లేనన్ని కారాలు మిరియాలు నూరుతున్నారు.

నే నేమీ అనలేకపోయాను సిద్ధాంతిగారిని.

మూలగా మౌనంగా కూర్చున్న శేషమ్మ మామ్మలో ఏమిటో ఉక్రోషం తాండవించింది.

'వాడిని ఎందుకు అందరూ తిడతారు? వాడు చాల మంచిపని చేశాడు. ఆ రాజారావే యీ పెళ్ళికి రాకపోతే లలితకు ఈ కుళ్ళుసంఘం చెరసాల తప్పేదిగాదు. లలిత ఆతనితో లేచిపోతే అది చాల మంచిపనే! అదృష్టముంటే పెళ్ళి జరిగి హాయిగా బ్రతుకుతుంది. లేకపోతే! ఇప్పుడు ఆమె చేసిన సాహసం, ఆమె జీవితాన్ని క్రొత్తపంథాలో నడిపించే శక్తి యిచ్చి, బాగుచేస్తుంది. నాలా మగ్గి యీ సంఘంలో చచ్చేకంటే పక్షిలా హాయిగా బ్రతకడం మేలు. అది నేర్చుకుంది లలిత.'' ఒక్కొక్క మాట పిడుగులు రాలినట్లు వచ్చింది శేషమ్మ మామ్మ నోటినుంచి. తనమీద బావుటా ఎత్తి విప్లవం రేకెత్తిస్తోందా అని సిద్ధాంతిగారు విస్తుపోయారు ఆ ముసలి వితంతువును చూసి.

'నువ్వేం మాట్లాడుతున్నావో తెలుసా! శేషమ్మా!' అరిచారు సిద్ధాంతిగారు; ఆమెమీద తనకున్న వ్యక్తిగత ప్రభావాన్నంతా కూడ గట్టుకుని.

"తెలుసు. నీకూ ఆ పిల్లకీ ఏం సంబంధం! దూరపు చుట్టమైనంత మాత్రాన, మా కుటుంబాలను యిష్టమొచ్చినట్లు తూలనాడడానికి నీకు హక్కు ఏముంది" అందరి హృదయాల్లోనూ అణిగిఉన్న ఆ ఎదురుప్రశ్న శేషమ్మ మామ్మ సిద్ధాంతి గారిపై విసిరింది, మర్యాద, మన్నన మరిచి పోయి.

సిద్ధాంతిగారి ముడుతల ముఖం జేగురు ముద్దలా కనిపించింది. కండువా బుజంమీద వేసుకుని లేచాడు తనకాయాం అంతరించే రోజులు వచ్చేయని తెలుసుకుని.

పోస్టుమేన్! బయటి నుంచి పిలుపు!

ఉత్తరం విప్పి చూశాను. పసుపు రాసిన తెల్ల కాగితంమీద నల్ల అక్షరాలు కనిపించాయి ఆత్రుతతో చదివాను. నవ్వుకున్నాను. నా నవ్వులోని ఆనందం ఎవరికీ చెప్పడానికి వీలు లేకపోయింది.

"సాయంత్రం అన్నవరం కొండకు వెళ్ళాలి తయారవు" నా భార్యను ఆజ్ఞాపించాను తక్షణం.

"ఎందుకురా?" అన్నారంతా.

"నాయిష్టం" అన్నా.

నా భార్య తెల్లబోయింది. దేవుణ్ణి చూడ్డానికి కాబోలు అనుకుంది.

అన్నవరం కొండమీద చెట్లనీడలో మమ్మల్ని ఆహ్వానించడానికి ఎదురుగా నిలుచున్న, రాజారావు తలను చూడగానే నా భార్య ఆశ్చర్య పోయింది.

"క్రొత్త దంపతులను ఆశీర్వదించవయ్యా" అంటూ అరిచాడు రాజారావు దూరాన్నుంచి నవ్వుతూ.

నా భార్య అది విని ఏదో అర్థమయినట్లు నవ్వింది.

"చూస్తారేం! గబగబ ఎక్కండి కొండ! ఓపిక పొగొట్టుకుని పాత దంపతులనిపించు కున్నారు!" అంది నా భార్య వేళా కోళంగా.

కొండ ఎక్కగానే రాజారావు నన్ను కౌగలించు కున్నాడు.

"ఎలావున్నాయి పరిస్థితులు ?" నవ్వాడు రాజారావు.

"బాగున్నాయి" అన్నా.

"ఇక్కడికి తీసుకవచ్చి, నాకీ అవసరనను చూపించినందుకు నీకు నా కృతజ్ఞతలు !"

నవ్వాను నేను.

"మీ శేషమ్మ మామ్మ దేవతోయి!" మా సమాగమానికి ఆమే పూజారి !"

శేషమ్మ మామ్మ సిద్ధాంతిగారిపై చూపిన రౌద్రంలోని అంతరార్థం నాకు ఇప్పుడు అవగతమయింది.

కొండమీద దేవాలయం గంభీరంగా పవిత్ర మానవ ఆశయాల ప్రతిబింబంగా నిలుచుంది. కొండమీద రివ్వుమని వీచే చల్లగాలిలో హాయిగా స్వేచ్ఛగా ఆలయ ప్రాంగణంలో అడుగిడుతూ దైవానికి ప్రణమిల్లాం మేమంతా. కాని తన పరిస్థితులకు బలియై, యీ పరిస్థితులు కల్పించిన శేషమ్మ మామ్మ మాత్రమే ఆ దేవాలయంలో ప్రతీచోటా నా కంటికి కనిపించింది.

యిలు అందిస్తూ, నల నల కాగే శరీరానికి చల్లగాలి యిచ్చేలా విసురుతూ, తలనొప్పితో విజృంభించే జ్వరంతో పగిలిపోయే నా శిరానికి మంచుగడ్డల రబ్బరు తిత్తి ఒత్తుతూ, నేను విడిచిన ప్రతి వేడి శ్వాసకు, మూల్గుకు, కుమూలుతూ పేరిందేవి చేసిన సేవ తల్లయినా చేస్తుందో చెయ్యదో అనిపించింది.

నలభై రోజులు గడిచాయి. నన్ను నక్కలా చెసి జ్వరం విడిచింది. ఎముకల పోగు శరీరంలా, గెడ్డం పెంచుకుని నీరసంగా పడుకున్న నా ఆకారం నాకే విచిత్రమనిపించింది. జ్వర తీవ్రతలో పేరిందేవిని పరిశీలించలేదు. కాని, ఇప్పుడు చూస్తే ఆమె మునుపటి కంటె సగం చిక్కిపోయింది.

ఆ రోజు పత్యం పెట్టారు. నాకోసం వెంకట్రావు సెలవు పెట్టి పేకాటతో కాలక్షేపం చేదామని ఇంట్లో ఉండిపోయాడు.

“మీరు చేసిన సేవ మర్చిపోలేదు. నేనుఒంటరిగా ఉండగా ఈ జ్వరంవస్తే ఏమయ్యేవాడినో!” అన్నా.

“జ్వరం తగ్గి కులాసాగా ఉన్నావు. మా కంతేచాలు” అన్నాడు వెంకట్రావు. భర్త మాటకు ఎక్కువ చెప్పవలసిన అగత్యంలేక పేరిందేవి వూరుకుంది.

“కొంతకాలం ఒకరి కొకరం కనిపించకపోయినా నా జీవితంలో ఏదోవిధంగా అమ్మలా సేవ చేస్తోంది పేరిందేవి. అమ్మలా అనేక సలహాలిచ్చింది. అమ్మలా అనేకసార్లు ఆదరించింది అసలు ఆకృతిలోనే మా అమ్మలా కనిపిస్తుంది” అన్నా పేరిందేవి కంటికి కొలకుల్లో కన్నీరు నుంచుంది. ఆమె పెదిమలు హాయిగా నవ్వాయి.

బత్తాయిపండు ఒలిచి చేతిలో పెట్టింది పేరిందేవి.

"ఈ పండులో స్వతస్సిద్ధంగా ఎంత రుచిఉందో తెలియదు కాని ఇది నీహస్తంతో యివ్వడంవల్ల నాకు చాలా మధురంగా ఉంది" తొనలు తింటూ నవ్వాను. పేరిందేవి నవ్వింది. పేకముక్కలు కలిపింది. నేను మరో రెండు నెలలు సెలవు తీసుకున్నా. నా అనారోగ్యం కారణంచే వెంక ట్రావు మరో అద్దె యిల్లు వెతుక్కోలేదు.

ఒక రోజు సాయంత్రం అయిదు గంటలయింది. వేడి హార్లిక్సు తీసుకుని మేగజైను తిరగవేస్తున్నా.

పేరిందేవి వెండి పళ్ళెంలో కొబ్బరికాయలు, అరటిపళ్ళు, పువ్వులు కుంకుమ, పసుపు పెట్టుకుని ఎదురుగా వచ్చి నిలుచుంది.

నా కర్థం కాలేదు.

"వేణూ! నేను కాళీ దేవాలయానికి వెళుతున్నాను. ఆయనకు కాఫీ, ఫలహారాలు వంటింట్లో పెట్టాను" అంటూ నవ్వింది పేరిందేవి.

మా బసకు ఒకమైలు దూరంలో కాళికాదేవి ఆలయం ఉంది. నగరం రద్దీలో మర్రిచెట్టుక్రింద వీధిమొగలో నిలుచున్న ఆ గుడికి వెళ్ళా లని ఎప్పుడూ ఆమె ఆసక్తి చూపించలేదు. ఈ వేళ ఎందుకు వెడుతుందో నా కర్థం కాలేదు.

"ఏమిటి విశేషం?" నవ్వాను.

"ప్రక్క యింటి బెంగాలీవాళ్ళు వెడుతున్నారు. నేనూ వెడ దామని" నమిలేసింది పేరిందేవి.

"సరే" అన్నా. ఆ విషయం యింక ఎక్కువ తల పెట్టలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చింది పేరిందేవి. చేతిలో కుంకం పొట్లం విప్పి "వేణూ! ఇది బొట్టు పెట్టనీ" అంది పేరిందేవి.

దైవం గురించి ఎక్కువగా ఎప్పుడూ చింతించని నాకు ఆ కుంకుమలో నమ్మకం లేకపోయినా పేరిందేవి వాత్సల్యంతో అడిగిందని ఒప్పుకున్నా,

కుంకంతో ఒక సన్నని నామం పెట్టింది. ఆమెనాకు నా ఆనారోగ్యానికి రక్షగా ఆ నామం కనిపించింది అద్దంలో.

"కాళి గుడికి ఎందుకు వెళ్ళావు?" ప్రశ్నించాను పేరిందేవి. ఆమె నవ్వి వూరుకుంది.

"నాకు ఒంట్లో బాగులేనప్పుడు మొక్కు కున్నా?" అవునన్నట్లు అంగీకారంగా నవ్వింది పేరిందేవి. నవ్వుతూ, చకచకా వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఆమె స్వీయ మాతృదేవతను ఎరుగనినాకుమాతృమూర్తి ఎదురుగా సాక్షాత్కరించి నట్లయింది. ఉప్పొంగిన ఆమె వాత్సల్యం నాకు ఆనందసాగరమైంది నన్ను ముంచి తేల్చింది. అంత ఆత్మీయత ప్రదర్శించే మనుష్యులు జీవితంలో అరుదుగా సంఘటితమవుతారు అనుకున్నా.

నేను బాగా ఆరోగ్యవంతున్నై ఉద్యోగంలోచేరి మామూలుగా తిరుగుతున్నా. ఇంటిదగ్గర శిస్తులు తెచ్చుకుని, నల్గురి బంధువులనీ చూసి వస్తాననీ వెంకట్రావు పది రోజులు సెలవు తీసుకునిస్వంతవూరు వెళ్ళాడు.

నాలుగు రోజులుగడిచాక ఒక ఆదివారం ప్రొద్దున మామూలుగా కాఫీ త్రాగి పేపరు చదువుతున్నా వంటింట్లోంచి దబ్బున ఒక పెద్ద శబ్దం విని పించింది. ఆశ్చర్యపోయి వంటింట్లోకి చూశాను తడిబట్టతో అప్పుడే స్నానం చేసివచ్చిన పేరిందేవి హఠాత్తుగా క్రింద పడిపోయింది. చేతిలో ఉన్న నీళ్ళచెంబు జారిపట్టీలుకొట్టి, సొట్టలుపడి నీరమంతా క్రింద ఒలికి పోసి నేలంతా తడిచేసింది. బలంగా నేలమీద పడ్డ ఆమె చేతుల గాజులు పగిలి ముక్కలయ్యాయి మెడలో ఉన్న మంగళసూత్రం చాచుకుని నేల మీదకు జారింది.

మాటలేక, స్పృహలేక, చలంనం లేక పడిపోయిన పేరిందేవి చూడ గానే నాకు టైఫాయిడ్ జ్వరం నాటి నీరసం ఆవరించినంత పనయింది. దగ్గరకువెళ్ళి తట్టా అయినా చలనం లేదు. పిల్లలు చిత్రంగా కంగారుగా తెల్లబోయి చూస్తున్నారు. పరుగెత్తుకుని క్రిందకు వెళ్ళి డాక్టరుగారిని తక్షణంరమ్మని ఫోనుచేశాను. డాక్టరువచ్చి చెప్పాడు:

"పేరిందేవి గుండె హఠాత్తుగా ఆగిపోయి చనిపోయిందని!" నాకు ముచ్చెమటలు కమ్మాయి. పిల్లలు ఏడ్పులతో తల్లి చుట్టూ మూగారు. ప్రక్కయింటి బెంగాలీలు సానుభూతితో పరుగెత్తుకు వచ్చారు. ఏమైతేనేం "పేరిందేవి ఇంక బ్రతకదని రూఢి అయిపోయింది.

తక్షణం వెంకట్రావుకు టెలిగ్రాం యిచ్చాను.

సాయంత్రానికి ఒక కవరు, ఒక టెలిగ్రాం వచ్చాయి. తనతండ్రి తల్లి చనిపోయిందని, తాను దహనక్రియలు చేయవలసి రావడంవల్ల యింకా పదిహేను రోజులు దాకా రాలేనని, వీలైతే పేరిందేవిని పంప మని టెలిగ్రామం ఇచ్చాడు. వెంకట్రావు అతనికి నా టెలిగ్రామ్ అంది

నట్లు లేను. "ఇంకెక్కడి పేరిందేవి!" శోకం ఆగక ఏడ్చాను. వెంక ట్రావు వచ్చేమార్గం లేక, మాతృదేవతలాంటి పేరిందేవికి కొడుకులా దహన క్రియలు నేనే చేశాను.

కవరులో నాన్న వ్రాసిన ఉత్తరం ఉంది. నేను టైఫాయిడ్ జ్వరం తగ్గక ఆరోగ్యంగా ఉన్నందుకు సంతోషిస్తూ వ్రాశారు. నేను బ్రతికి ఉన్నానని తండ్రి ఆనందించారు, కాని నేను బ్రతకడమే పేరిందేవిని బలి కోరినట్లు అనుపించింది నాకు.

పేరిందేవిని కాళీకాదేవి గుడికి వెళ్ళిన సన్నివేశం నా కళ్ళముందు కట్టింది. నా హృదయం వ్యథతో కరిగిపోయింది. కన్నతల్లిని చూడలేక పోయిన నాకు మాతృమూర్తిలా ఉన్న పేరిందేవి చివరికి ప్రాణదానంచేసి నిజంగా నాజీవితంలోని మాతృదేవత అయింది.

పేరిందేవి తన పిల్లలను పెద్ద కొడుకులా నాకు అప్ప చెప్పినట్లని పించిది. తల్లి పోయిందని విలపిస్తూ అమాయక హృదయాలలో అర్థం కాని బెంగతో అలమటిస్తున్న ఆ పిల్లల్ని చూసి జాలిపడ్డా. ఒక నెల రోజులు సెలవుపెట్టి పిల్లల్ని వెంకట్రావు స్వంతవూరు తీసుకువెళ్ళా.

తండ్రి లేకపోవడ వల్ల చనిపోయిన అమ్మకు వెంకట్రావే అంత్య క్రియలు చెయ్యవలసివచ్చి ఆవూరు వదిలి తక్షణం కలకత్తా రాలేక పోయాడు ఆతను.

అత్యంతమైన అభిమానంతో అందాలరాసి అని భార్యని పూజించె టంతస్థితిలో ఉండే వెంకట్రావు భార్య మరణవార్త విని ఒక నిమిషం కొయ్యబారి పోయాడు. నేనూ, పిల్లలురాగానే గొల్లుమని ఏడ్చాడు నన్ను చూసి, పిల్లలు బిత్తరపోయి బిక్కముఖం వేశారు.

నెలరోజులు వెంకట్రావు అతని పిల్లలతో అక్కడే గడిపి, నాన్నను చూడాలని మావూరు వెళ్ళాను. నాన్న నన్నుచూసి ఎంతో ఆనందించాడు ఆరోగ్యంగా హాయిగా ఉన్నానని, మాచెల్లెలు సీత నెలగర్భంతో ఉందని ఆనందవార్త అందిచ్చాడు నాన్న నాకేదో హఠాత్తుగా మనస్సుకు తట్టింది. "సీతా! క్రిందటిసారి నీకు సాముద్రికం చెప్పా ఆడపిల్ల పుడుతుందని జ్ఞాపకముందా.?"

"జ్ఞాపకముంది" సిగ్గుపడింది సీత.

"నా సాముద్రికం నిజమైతే నే కోరినట్లు చేస్తావా?"

"చెప్పు" ఆశ్చర్యంతో నాకేసిచూచింది.

"పేరిందేవి అని పేరు పెట్టు" అన్నా.

"మీ అమ్మపేరు కదూ!" అంది సీత.

"అవును, మా అమ్మపేరు! నా జీవితంలో కనిపించిన నిజమైన మాతృమూర్తి పేరుకూడా."

ప్రక్కనే నిలుచుని వింటున్న నాన్న చకితులయ్యారు. తర్వాత ఏదో సర్దుకుని నెమ్మదించినట్లు కనిపించారు.

"పెట్టమ్మా! అలాగె పేరు పెట్టు!...కనకమ్మగారు ప్రసవించినప్పుడు నేను వాళ్ళింట్లోనే వున్నాను. పుట్టగానె వాళ్ళ ఆడపిల్లకు పేరిందేవి అని నేనే మొదట నామకరణం చేశాను. నా మాట త్రోసివెయ్యలేక వాళ్ళ అమ్మా అదే పేరు పెట్టారు కనకమ్మగారు నేను పెట్టిన పేరు సార్ధకమైంది పేరిందేవి ముమ్మూర్తులా మీ అమ్మలాగే కనిపించేది వేణూ!" నాన్న కంట తడి పెట్టారు.

సంధ్యారుణ సమయందాటి చీకట్లు అలముకున్నాయి పూరంతా. నాన్నను, సీతను వదిలి ఒంటరిగా ఒక నిమిషం గడపాలని డాబామీదకు పచారుకు వెళ్ళాను.

సీతకు చెప్పిన సాముద్రికం నిజమవుతుందనే దృఢవిశ్వాసం నాలో కలిగింది. ప్రబలమైన మమతలతో మరణించిన మా అమ్మ తరాలు గడిచినా నాకోసం తనువు దాలుస్తుందనే వెర్రి నమ్మకం కల్గింది. హృదయంలోని ఆవేదనతో వేడి కన్నీరు విడిచాను.

శిరస్సుమీద దూరంగా ఉన్న నిశ్శబ్ద నిశీథ ఆకాశంలోని చుక్కల గుంపులు గతించిన తరాల ప్రత్యక్ష చిహ్నాలుగా గోచరించాయి. ఒక వెలుగుచుక్క వేగంగా రాలింది. రాలుతూ జ్వాజ్వల్యమానంగా ఆ వెలుగు నా హృదయంలోకి ఒక ఆనంద రేఖలా ప్రవేశించింది.

# ఏకాంతం

బయట నిప్పులు చెరిగే ఎండవేడి, ఒంట్లో బాగులేకుండడం, ఇంట్లో ఆడవాళ్లు పొరుగూరు బంధువుల యింటికి విందుకు వెళ్ళడం— మొదలైన పరిస్థితులు నన్ను యింట్లో బంధించాయి ఒంటరిగా. సంఘంలో నిత్యం మసిలే అలవాటున్న మనిషికి, స్నేహితులు లేనిదే క్షణం గడపలేని మనిషికి ఏకాంతంగా ఉండడం చాలాబాధే! విపరీతమైన చికాకు కలిగింది నాకు. ఆ ఒంటరితనం గడపడం చాలా దుస్సాధ్యమనిపించింది.

ఒక్కసారి ప్రక్కమీద పడుకుని ఏమీ తోచక లేచి తిరిగాను. తిరిగి విసిగెత్తి వెళ్ళికుర్చీలో జార్లగిలబడ్డాను.

"ఏయ్!" ఎవరో పిలిచారు రెపరెపశబ్దం చేసుకుంటూ.

ఎదురుగా టేబిలుమీద వార్తా పత్రిక గాలికి రెపరెపశబ్దం చేసుకుంటూ, వెయ్యినల్లకళ్ళు చిలిపిగా కదుపుతూ పిలుస్తోంది.

"కబుర్లుచెప్పవా" అడిగింది వార్తాపత్రిక.

నా చేతులు ఆనందంతో పత్రికచేతులతో కలిసేయి. పత్రికలోని నల్లటి అక్షరాలకళ్ళు నాకళ్ళలోకి తొంగిచూశాయి.

"ప్రపంచ" సమరం త్వరలోరాదు.

అమెరికానుంచి ఒక ప్రసిద్ధ నాట్యకత్తె వచ్చి బొంబాయిలో ప్రదర్శనలిచ్చింది.

ఒక రాజకీయవేత్త పరిస్థితులమీద కోపంతో రాజీనామా యిచ్చాడు పదవికి.

అత్యాచారాలు అరికట్టాలని ఒక ముసలివాడు సత్యాగ్రహం సలుపు తానని ప్రతినపట్టాడు.

కావాలి ఒక ఇరవైపిడేండ్ల అందమైన చదువుకున్న తెలుగు అమ్మాయికి ఉద్యోగంచేస్తూ హాయిగా బ్రతకగలిగే ముప్ఫయ్యేండ్ల వరుడు కావాలి. కులంతో నిమిత్తంలేదు.

ఒక మగవాడి శవం హుస్సేనుసాగరులో తేలింది.

హిహిహి! ఎల్లావున్నాయి నాకబుర్లు అడిగింది వార్తాపత్రిక.

వసపోసిన పిట్టలా అనవసరమైన తనగొడవలు భలవంతంగా చెప్పుకు పోయే స్నేహితునిలా విసుగు కలిగించాయి అవార్తలు వార్తలరూపాలు రోజురోజుకు వేరైనా అంతరార్థాలు ఒకటే. స్నేహానికి అవసరమై పర స్పరంగా అభిరుచి ఉన్న విషయ చర్చవదిలి, ఒక్క తనగొడవ, గోడు వినమని, బలవంతపెట్టే స్నేహితునితో ఎంతకాలం గడపగలం!'

'నీకో నమస్కారం! సెలవు' అన్నాను.

'నన్నర్థం చేసుకోలేని స్నేహితుడు నాకూ అనవసరం!' కోపంతో విసురుగా పోయింది. టేబిలుమీదకు వార్తాపత్రిక.

వీపుమీద చురుక్కుమని వేళాకోళంగా ఒక గిల్లుగిల్లేరు ఎవరో!

"ఏం కులాసాగా ఉన్నావా? నిన్నువెన్నంటి తిరుగుతున్నా ఎక్కడా గుర్తు పట్టినట్టు లేదు!"

నలుపు శరీరం మీద ఎరుపురంగు పూసుకుని, షోకుగానుంచిని, వయ్యారంగా తనతొండం త్రిప్పుతూ కుర్చీగుడ్డమీద నృత్యంచేస్తున్న నల్లి కనిపించింది.

'ఓహో! నువ్వా!' అన్నాను.

'గుర్తు పట్టావన్నమాట! జ్ఞాపకముందా?'

'జ్ఞాపకం కలిగించావు!'

'మరి ద్రాక్షపండ్లు, అపిలుపండ్లుతిని దిట్టంగా శరీరం పెంచుకుని, మత్తుగా మసిలే స్నేహితుణ్ణి గిల్లకపోతే పలుకుతాడూ? అందుకే గిల్లాను!' అంటూ పకపక నవ్వుతూ తొండం ముందుకు వెనుకకు ఊగిసలాడిస్తూ అన్నది నల్లి.

'చాలా హుషారుగా ఉన్నావే?'

'నీరక్తం చాలా తియ్యగా ఉందిలే! మత్తుకలిగి నృత్యంచేయ బుద్ధి పుడుతోంది.

'నెత్తిమీద మొట్టుతే అమత్తు పోతుందేమో! కదూ!'

'మొట్టుచూద్దాం?' గట్టిగానవ్వుతూ ఎగిరింది నల్లి! నా రెండు చేతులు నల్లి తలమీదకు ప్రాకాయి.

'పట్టుకో చూద్దాం!' అంటూ నల్లి లేడిలా పరుగెత్తింది.

'ఆగు' అరచాను.

'పట్టుకో!' అంటూ నల్లి పరుగెత్తి కుర్చీలోదూరి తొంగిచూస్తోంది హేళనగా నవ్వుతూ.

'మా బలేస్నేహితుడివి లే,' అన్నాను వ్యంగ్యంగా.

'టాటా'!' అంటూ తొందంతఊపింది నల్లి 'మళ్ళీ కలుసుకుంటాగా' అన్నట్టు.

ఎదురుగా టేబిలుమీద బంగారు రంగులో ఒక సిగరెట్టుకేసు తళతళా మెరుస్తోంది ప్రేయసి కన్నుల్లా! పెట్టెలో ఏదో చప్పుడవుతోంది. విప్పిచూశాను. లోపలబంధించానన్న కోపంతో, బద్ధకంగా పడుకున్న సిగరెట్లు. సిగరెట్టుకేసును చిలిపిగా తన్నుతోంది. కేసు విప్పగానే, లేచి కూర్చొని ముద్దుపెట్టుకోమన్నట్లు చేతిలోకి గెంతింది వయ్యారంగా.

నా పెదాలమధ్య బంధించాను సిగరెట్టును.

ఆ స్పర్శ సుఖంతో అగ్నిజ్వాల రేగింది.

సుడులుతిరిగిన పొగలా, రింగుల్లా గాలిలో తేలుతోంది. ఒక్కొక్క పొగరింగులో ఒక్కొక్క ప్రతిబింబం! ఎప్పుడో చూచిన ముఖాలూ మెదడులోపల దాక్కున్న ప్రతిబింబాలు!

ఒక పొగరింగు సొగసుగా గాలిలో నృత్యంచేసింది!

అదులోంచి ఒకముఖం నవ్వింది.

'నమస్కారమండి' నవ్వు వెలిగింది.

ఆ పొగరింగు పూర్తిగానిండే సుందరవదనం, పూర్ణమైన చంద్ర బింబంలా! హృదయాలు గాయాలు పరచకుండా జాగ్రత్త పడడానికి తళతళ మెరిసేకళ్ళు కప్పుతూన్న నల్ల కళ్ళద్దాలు, చంద్రబింబంలోని మచ్చల్లా! చంద్రబింబాన్ని అల్లుకున్న నల్ల మేఘాల్లా నొక్కునొక్కుల

నల్లనిజుట్టు!! ఆకాశరాజ్యంలో పరుగిడుతున్న చంద్రబింబంలా బస్సులో వేగమైన ప్రయాణం!! నాల్గుసంవత్సరాల క్రితం నాజుకుగా, ఒక్కగా, పొట్టిగాఉన్న ఆ అమ్మాయి దిన దిన ప్రవర్ధమానమైన చంద్రవంకలా సంపూర్ణంగా ఆనిండు యౌవన వదనం పొగ రింగులోంచి తొంగిచూచింది.

'నమస్కారమండీ!' మళ్ళీ నవ్వింది ఆమె.

అది ఒక్క నమస్కారబాణమే కాదనిపించింది!

నవ్వుకున్నా ఆనందంగా:

చెయ్యి చురుక్కున కాలింది.

పర స్త్రీమీద వ్యామోహం చూపించిన నామీద కోపగించి నాదగ్గర ఉన్న సిగరెటు అసూయలో దహించుకుపోయింది. అమాయకంగా దహించుకుపోయిన దాని ఉసురు నన్ను చురుక్కుమని కాల్చింది.

గబుక్కున కింద రాల్చాను ఆ సిగరెట్టు ముక్కను, గతించినప్రేమ ఉలికి జాలిగా మారింది ఆ ముక్కపైన.

అందని ప్రేమవల్ల అవ్యక్తమైన బాధ ఎంతో కలుగుతుంది.

ఆ సిగరెట్టు పొగరింగులు గాలిలో తేలుతూ దూరంగా దూరంగా నా కంటిముందే పయనించి మాయమైపోయాయి. నాకు ఎంతో బాధకలిగింది.

నా గుండెక్షణం ఆగి, మళ్ళీ ప్రసారం ప్రారంభించింది.

నా గుండె చప్పుడులాగే ఎదురుగా గడియారం టిక్కు టిక్కు మంటూ కొట్టుకుంటోంది.

'ఏమి! తోచటం లేదూ? అంటూ నా నెత్తిని దూసుకుంటూ చలాకీగా ఎగిరి కిటికిలో నుంచుంది పిచ్చుక ఒకటి.

'తోచటం లేదూ? పాటపాడనా?,' లాలించింది పిచ్చిక.
'ఊ' అన్నాను పాటైనా విందామని.

'చుప్ చిప్ చుప్ చిప్!' అంటూ గడియారం టిక్కు టక్కుల వంటి మద్దెల శబ్దానికి అనుగుణ్యంగా పాడుతూ నృత్యంచేసింది పిచిక.

'ఎలాగుంది?' అడిగింది పిచిక.
'బాగుంది!' అన్నాను భావంగా.

మళ్ళీ పాడనా! చిప్ చుప్, చిప్ చుప్!' గాలిలో తల్లక్రిందులుగా మొగ్గలేసింది. పిచిక, పాడుతూ!

'ఎందుకు నీ కింత శ్రమ?' అన్నా.

'నీ స్నేహం మరచిపోగలనా? నీయింట్లో నాగూడు కట్టుకోడానికి స్థలంయిచ్చి ఆదరించారు నాపిల్లలు ఆగూటిలో సుఖంగా ఉన్నారు! నీ ఆదరణ, ఋణం ఎలా తీర్చుకోగలను?' అంది అమాయకంగా పిచిక.

నీ పిల్లలు ఎదిగాక వాళ్ళచేతకూడా నృత్యప్రదర్శనం చేయించు నాయింట్లో!' అన్నా నవ్వుతూ.

'తప్పకుండా' అంటూ వాగ్దానంచేసి, అనందంగా పాడుతూ ఎగిరి పోయింది పిచిక.

అలమరు క్రిరున చప్పుడయింది. ఎమిటే! అలావున్నావు?' అంటూ సాగదీసుకుంటూ

తక్షణం చేతులు చాచుతూ ఎగిరి నామీద పడింది ఒక పుస్తకం.

'నేనున్నాగా నీ కాలక్షేపానికి! నిన్ను మరో లోకంలోకి తీసుకు వెడతా!! 'ఊ నన్ను పరీక్షించు,' ఆత్రుతతో అల్లల్లాడింది కదిలే పేజీల చేతులు త్రిప్పుతూ, ఆ పుస్తకం.

రెండు పేజీలు త్రిప్పాను మౌనంగా.

అనగనగా ఒక రాజు ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. పాతకథే

ఒక అమ్మాయిని ఒక అబ్బాయి ప్రేమించేడు. ఆమె ప్రేమించ లేదు. భగ్నహృదయం!

ఆ రాజు ఇంద్రుడు, చంద్రుడు లాంటివాడు. ఆ దాసి నీచురాలు మూర్ఖురాలు! మునుపటి అభిప్రాయలే!

బూజుపట్టిన పాత కథలు, పరిపాటైపోయిన ప్రణయ కలాపాలు; విలువలేని బాహ్యమైన అభిప్రాయాలు, మారాలి! పుస్తకం విసిరేశాను, పుస్తకం గిలగిల తన్నుకుని ఒకమూలగా ఒరిగింది.

పాడైపోయిన రేడియో రోగిష్ఠిదైన విశ్వాసమైన కుక్కలా ఎదురుగా మూల్గుతూ నాకేసి చూస్తోంది 'నీ కేమీ సంతోషంకలిగించలేను ప్రస్తుతం!' అంటూ.

చికాకు పెరగింది.

మెదడులో ఏదో తుపానులాంటి సంచలనం కలిగింది. ఒక మెరుపు మెరిసింది ఎవరో వచ్చినట్లు.

'ఎవరు?'

'నీ స్నేహితుణ్ణి!'

'పేరు?'

'ఆలోచన! నేను నీ వెంటే ఉన్నా, నే నట్టే మనిషిలు తూండడం నీ కలవాటయి పోయింది!'

'నామీద అంత అభిమానమా?'

'ఓ!... సినీమాకి వెడదామా?'

'ఒంట్లో బాగ లేదు! రాలేను?'

'అయితే యిక్కడే చూపిస్తా సినిమా!'

'ఎల్లాగ?'

'ఒక్కసారి కళ్ళుమూసుకు తెరు!'

'ఊ'

శివాలయం—పూజారి మాష్టారు పాఠాలు చెబుతున్నారు—ఆఫీసరుగా అమ్మాయి పుస్తకాలతో వచ్చింది—నిమ్మతొనలు పంచిపెట్టింది కుర్రాళ్ళకు ఆ అమ్మాయి అందరూ మాష్టారికి తెలియకుండా తింటున్నారు...నాకు దొరకలేదు...ఉడుకుమోతులా అసూయతో అరిచాను 'నాకో' అని...మాష్టారు విన్నారు ..పేము బెత్తంతో వచ్చారు...అరిచినందుకు నన్ను, స్కూల్లో నిమ్మతొనలు తింటున్న పిల్లలనూ గట్టిగా కొట్టారు. దెబ్బలు తగలినా నిమ్మతొనలు దొరకలేదని విచారించాను... ఎక్కడుందో ఆ అమ్మాయి!

మానాన్న...పొట్టిగా లావుగా బుట్టతలతో, చిన్న బొజ్జతో నవ్వుతూ కనిపించాడు.

'చుట్టకాలుస్తావురా?' అడిగాడు.

ఒకటి వాసన చూశాను.

'ఈ దురలవాటు వాడికి కూడా నేర్పండి!' మా అమ్మ కోపంతో నవ్వింది.

'పోనీ వాడ బదులు నువ్వు కాల్చు' అంటూ నాన్న చుట్ట చేతికిచ్చాడు మా అమ్మకు.

'అబ్బ! మీకు అన్నీ యిటువంటి వేళాకోళాలే!' ఆమె సిగ్గుతో నవ్వింది.

అమ్మచేత చుట్టకాల్పించు నాన్న!' అన్నాను.

'ఓరి వెధవ!' అంది అమ్మ! నాన్న నవ్వు! తెగ నవ్వాడు నాన్న చనిపోయిన నాన్న ఎక్కడున్నాడో!!!

'ఏమండి! మీరు ఆ లుంగీకట్టుకుంటే వంటవానిలా ఉన్నారు!

'తమరు ఆ తెల్లచీర కట్టుకుంటే హాస్పిటలులో నర్సులా ఉన్నారు

'మీరు నాకు వంటచేసి పెట్టండి నేను మీకు వైద్యం చేస్తాను!'

'ఆ ఈకాలపు ఆడవాళ్ళు అంతా యింతేలే!!'

ఆమె కిల కిల నవ్వింది.

ఎవరు?

కాబోయే భార్య!

బాగుంది! ఎక్కడుందో!!

ఉష్! చికాకెత్తింది. సినిమా తొలగిపోయింది.

కాళ్ళగజ్జెలు ఘల్లున శబ్దం చేస్తూ నిలయితాండవంతో వూగిపోతూ, తన హస్తాలలోకి తీసుకుంది నన్ను ఒక మహాసాధ్వి! మళ్ళీ నృత్యం

చేసింది!! ఆ నృత్యంలో ఊగిసలాడిపోయాను!! అయినా ఆ నృత్యం లయ తాళాలలో సన్ననిమైకం. తూలించేమత్తు, తేలి పోయే హాయి, అనుభవించాను. ఎంతో ఆనందంగా ఉంది.

'నీ పేరు' ఆమెను అడిగాను.

'నిద్రా దేవత!'

'నువ్వంటే నాకెంతోయిష్టం! నిన్ను ఎప్పుడూ పూజిస్తాను నేను!'

'నీకు వరం యివ్వనా? నువ్వు నన్ను తల్చుకుంటే చాలు, ఆనందంగా నృత్యం చేస్తా నీ కోసం!' ఆమె గంభీరమైన పెద్ద వదనంలో నుంచి మందహాసం వెల్లగక్కింది. ఆ మందహాసం నన్ను సమ్మోహనం చేసినట్టు మైమర్పు కలిగించింది.

'ధన్ ధన్' తలుపు చప్పుడు.

'ఓరేయ్ సత్యం గుమ్మంలో అరుపు.

మసిపిలాంటి స్నేహితుడు, వచ్చాడు. బయటినుంచి పిలుస్తున్నాడు. ఏకాంతం నడలిపోయింది. మిత్రుని రాదకన్న ఏకాంతంలో స్నేహితులే మంచివాళ్ళనుకుంటూ, చిరాకుతో వెళ్ళి తలుపుతీశాను తప్పనిసరిగా.

# రా య బా రి

వారానికి ఒక్క సారైనా యింటికి వచ్చి పిల్లల యోగక్షేమాలు చూసే సత్యనారాయణ నెలరోజులు గడిచినా యింటికి రాలేదు. జానకమ్మకు ఆదుర్దా కలగలేదు కాని చాలా బాధపడింది. చిన్న విషయంపై మాటపట్టింపులు పెట్టుకుని కోపంతో భర్త యింటికి రావడం మానేశాడని ఆమెకు తెలుసు.

ఎంతో అభిమానంతో నిత్యమూ పరిహాసాలాడే సత్యనారాయణ కోపం తెచ్చుకొని యింటికి రాకపోవడంవల్ల యిల్లంతా చిన్నబోయింది. పిల్లలు తండ్రిగురించి అస్తమానూ అడగసాగారు ఐదేండ్ల ఆఖరిపిల్ల విమలకు మూడురోజులనుంచి తీవ్రంగా జ్వరం కాస్తూంది. తండ్రి గురించి కలవరిస్తోంది.

అక్కడికి నాల్గు ఉత్తరాలుకూడా రాసింది జానకమ్మ, యింటికి రావలసింది పిల్లలు బెంగ పెట్టుకున్నారని కాని సత్యనారాయణకు జానకమ్మమీద కోపం తగ్గక యింటికి రాలేదు. ఆమె కాపురానికి వచ్చాక గడిచిన పది సంవత్సరాలలోనూ సత్యనారాయణకు యింత కోపం రావడం జానకమ్మ ఎప్పుడూ చూడలేదు. ఆ కోపం యిక ముందుకూడా యిలాగే ఉండి పోతుందేమో అని భయపడి దుఃఖం ఆగక ఏడ్చింది.

అప్పుడే ఆటలు ఆడుకుని యింటికి వచ్చిన కృష్ణుడు, తల్లి ఏడుస్తూ కొంగుతో కన్నీరు తుడుచుకోడం చూశాడు ఆమె కన్నీరు అతనిలో ప్రేమ సుహ్పాంగ చేసింది.

"అమ్మా! ఎందుకే ఏడుస్తున్నావు!" అంటూ కృష్ణుడు తల్లి ఒడిలో కూర్చుని అనునయించాడు.

తొమ్మిదేండ్ల కుర్రవాడు కృష్ణుడు తన దగ్గరకువచ్చి అనునయిస్తూంటే, ఎందుకో ఆమెకు దుఃఖం పొంగిపొరలింది. వెక్కి వెక్కి ఏడ్చింది. దుఃఖం దిగమింగుకుని మొండిగా సంచరించేవాళ్ళను ఎవరైనా ఓదారిస్తే సముద్రపు కెరటంలా ఒక్కసారి ఉబికి వస్తుంది. దుఃఖం.

జ్వరంతో మంచం మీద పడుకున్న విమల "అమ్మా! నాన్న ఎప్పుడు వస్తారే! మంచిబొమ్మలు తెస్తానన్నారే నాకు" అంటూ తల్లినడిగింది.

కృష్ణుడికి తండ్రి జ్ఞాపకం వచ్చాడు. "అమ్మా! నాన్న నెల్లాళ్ళనుంచి ఎందుకు రావటం లేదే యింటికి" అని అమాయకంగా ప్రశ్నించాడు.

ఏదో కారణం కొడుక్కి చెప్పవలసిన బాధ్యత జానకమ్మ మీద పడింది. అసలు సంగతి చెప్పదలచక పోయినా, దానికి సంబంధించిన మాటలు మాత్రం అప్రయత్నంగా ఆమె నోట వచ్చేశాయి సమాధానంగా.

"మీ నాన్నకు నామీద కోపం వచ్చిందిరా."

"ఎందుకే?"

ఈ మాటకు ఏం సమాధానం యివ్వాలో జానకమ్మకు తెలియలేదు. ఆపుకుందా మన్నా దుఃఖం ఆగక బలవంతాన పైకి వెల్లుబికింది. తల్లి ఏడుపుచూసి కృష్ణుని కడుపు తరుక్కుపోయింది.

"ఎందుకే అమ్మా అలా ఏడుస్తావు? నేను వెళ్ళి నాన్న గారిని తీసుకువస్తానే."

కొడుకు మాటలు విని ఒక్క సారి జానకమ్మ అతని ముఖంలోకి చూసింది. ఆమెకు మెదడులో ఏదో గబుక్కున ఆలోచన తట్టింది. కాని ఆమెకు భయం వేసింది. కొడుకు ఒక్కడూ ప్రయాణం చేసి తండ్రి దగ్గరకు వెళ్ళగలడా?

ఆయిన కొద్ది రోజులు ఓపిక పడితే సత్యనారాయణ తిరిగి రావచ్చనే ఆశతో, ఆ విషయం ప్రక్కకు నెట్టింది ఆమె.

మరో పదిహేనురోజులు గడచినా సత్యనారాయణ యింటికి రాలేదు. అతను యిల్లు విడిచి వెళ్ళినప్పుడు యిచ్చిన అరవై రూపాయలు ఖర్చయిపోయి అప్పుడే రెండు వారాలు గడిచాయి. పైగా అప్పులు పెరిగిపోయాయి ఆ వూరిలో.

సత్యనారాయణ పుట్టిపెరిగిన ఊరు అవడంవల్ల, ఆయనకున్న పరపతి యింతకాలం జానకమ్మ ఉపయోగించుకుని కృష్ణుడి చేత యింట్లోకి కావలసిన దినవెచ్చాలు అప్పుచేసి తెచ్చుకుంటోంది. పాలు, చాకలి, పెరుగు వాళ్ళు మామూలుగా వతనుగా పోస్తున్నా, నెలాఖరున డబ్బు ముట్టకపోవడంవల్ల రోజూ యింటికి వచ్చి అడిగి,కసురుకుని మరీ వెళ్ళిపోతున్నారు. బియ్యం యిచ్చే వీరన్న నాల్గోసారి రావడమైంది. "ఏమండీ! డబ్బు యివ్వరా? బాబుగారు ఎప్పుడువస్తారు!" అని సణిగాడు దిన దిన గండంగా బ్రతికే యింట్లో దాసీది నెలాఖరున రావలసిన నాల్గురూపాయలు ముట్టక పోయేటప్పటికి కటకటలాడి పోతుంది. జానకమ్మను బెదిరించిందికూడా,పని మానేస్తానని. కోమటి సత్తెయ్య పద్దుబుక్కు పుచ్చుకుని పదిసార్లు ప్రత్యక్షమయ్యాడు.

పొరుగింటి రహస్యాలు ఛేదించి తెలుసుకుంటే గాని ఊబుసుపోని అమ్మలక్కలు, సత్యనారాయణ నెలా పదిహేను రోజులు యింటికి రాక పోవడంవల్ల సంగతి ఏమిటని గుసగుస లాడుకున్నారు. కారణం ఏమీ కనిపించక, జానకమ్మను వదిలేసి ఉంటాడనీ, ఏ ముండలతో లేచిపోయా డనీ నోటికి వచ్చినరీతిగా అపవాదులు ప్రచారం చేశారు.

ఇవన్నీ జానకమ్మ చెవినిబడ్డాయి. ఆ మాటలు విని సహించలేక కుళ్ళి కుమిలి ఏడ్చింది. యింక ఏలాగైనా కృష్ణుడిని తండ్రిదగ్గరకు పంపి యింటికి రమ్మందామనుకుంది. దారి ఖర్చులకు ఏమిస్తుంది? చేతిలో ఒక్క పావలామాత్రం ఉంది. ప్రక్కయింటివారిని అప్పు అడుగుదా మంటే, తన భర్త విషయము మొట్టమొదట ప్రశ్నిస్తారు. ఆమెకు తల తీసినట్లవుతుంది. జానకమ్మకు ఏమీతోచక దిగులుగా ఒకమూల కూర్చుని ఏడుస్తోంది.

కృష్ణుడు తల్లి దిగాలు ముఖం, దుఃఖం చూసి ఆమె దగ్గరకు వచ్చాడు.

"ఎందుకే అలా వున్నావు అమ్మా! నేను వెళ్ళి నాన్న గారిని తీసుకు వస్తాను. డబ్బు యివ్వవే" అన్నాడు.

ఉబికివచ్చే దుఃఖాన్ని దిగమింగుకుంది జానకమ్మ.

"అయితే వెడతావా కృష్ణా?"

"వెడతానమ్మా."

"ఎలాగ వెళ్ళాలో తెలుసా!"

"బజారులో బస్సుందికదే! అది ఎక్కితే వెళ్ళిపోతాను."

ఇప్పటివరకు ఎన్నడూ కృష్ణుడు ఒంటరిగా ప్రయాణంచేసి ఎరగడు, అందులో ముప్పదిమైళ్ళ దూరంలో ఉన్న కోటిఫలి ఎలా వెళ్ళాలో ఏం తెలుస్తుందో! బజారులో బస్సుస్టాండు దగ్గర "కోటిఫలి" అని వ్రాసివున్న బస్సుచూసి, అది ఎక్కితే కోటిఫలి వెళ్ళిపోవచ్చని అతని ఉద్దేశ్యం. పైగా తండ్రి కోటిఫలి వెడుతూ ఆ బస్సు ఎక్కడం రెండు సార్లు చూశాడు కృష్ణుడు.

కొడుకు ఊహ గ్రహించి జానకమ్మ నవ్వింది. అతని ఊహాల లోతు కనుక్కుందామని మళ్ళీ ప్రశ్నించింది జానకమ్మ.

"మరి కోటిఫలి బస్సుఎక్కి వెడతావనుకో! తర్వాత నాన్న గారు ఎక్కడ ఉన్నారో ఎలా కనుక్కుంటావురా."

"ఏముంది! ఇన్స్పెక్టరు సత్యనారాయణగారు ఎక్కడున్నారని అడిగితే, ఎవరైనా చెబుతారమ్మా! నోట్లో నాలిక ఉంటే అన్నీ చేయవచ్చు"

కృష్ణుడి మాటల అమాయకత్వంలోని ధైర్యం జానకమ్మకు సేద కూర్చింది. కాని చేతిలో ఒక్క పావలామాత్రం ఉంది. బస్సుకైతే రూపాయిన్నర కావాలి పడవకైతే మూడణాలతో వెళ్ళవచ్చు. ప్రక్క యింటి అమ్మ లక్కలను అప్పు అడగడం యిష్టంలేక, కొడుకు చేతిలో పావలా పెట్టింది. జానకమ్మ.

"సాయంత్రం ఆరుగంటలకు కాలవ ఒడ్డుకు కోటిఫలి వెళ్ళే పడవ వస్తుంది. అది ఎక్కితే తెల్లవారేసరికి కోటిఫలి వెళ్ళవచ్చు. నాన్న గారిని కలుసుకొని యింటికి నేను రమ్మన్నానని చెప్పు." అంది జానకమ్మ కృష్ణుడిని ఒంటరిగా ప్రయాణం చేయిస్తున్నాననే దిగులుతో అది తప్ప, మరోమార్గం కనిపించలేదు ఆమెకు

"నీ కంత బెంగ ఎందుకే, నేను వెళ్ళివస్తాగా" కృష్ణుడిచ్చే ఆమాయక వాగ్దానం నవ్వుతూ అందుకుంది.

కంచంలో పెట్టిన అన్నం తిన్నాడు కృష్ణుడు, యింటిలో ఉన్న పాతనంచీలో రెండు లాగులు రెండుచొక్కాలువేసి కృష్ణుడి చేతికిచ్చింది జానకమ్మ.

నంచీ అందుకుని 'అవెళ్ళివస్తానే అమ్మా' అన్నాడు కృష్ణుడు.

"ఎక్కడికి అన్నయ్యా" అంది విమల వీధిలోంచి వస్తూ పిల్ల 'ఎక్కడికి అని వేసినప్రశ్న కృష్ణుడి ప్రయాణానికి అపశకునమేమో అని భయపడింది జానకమ్మ. కాని అమాయకపు చిన్ని ఆడపిల్ల నవ్వుతూ ఎదురుగా రావడం మంచిశకునం కావచ్చని తర్వాత ధైర్యం తెచ్చుకుంది ఆవిడ.

"నాన్న దగ్గరికి" అన్నాడు కృష్ణుడు చెల్లెలితో.

"అమ్మా! నేనూ వెడతానే" అంటూ మారాము చేసింది విమల.

"తప్పు! అన్నయ్యావెళ్ళి నాన్నను తీసుక వస్తాడు. అందాక మనం యిద్దరం ఇక్కడేవుందాం. మంచికథలు చెబుతాను." అంది జానకమ్మ.

'నువ్వు ఎప్పుడూ యింతే. ఎక్కడికీ పంపవు.' అంటూ మూతి ముడుచుకుని యింట్లోకి పోయింది విమల.

కృష్ణుడు నవ్వుతూ నుంచున్నాడు, తల్లి అనుజ్ఞకోసం,

'మరి నాన్నగారు కనిపించకపోతే, మళ్ళ యింటికి ఎలా రాగల వురా' అంటూ దిగులుగా మళ్ళీ అడిగింది జానకమ్మ, తాను యిచ్చిన పావలా ఒక్కపడవ ఖర్చుకు సరిపోతుంది.

'నువ్వేం భయపడకమ్మా! నేను వెళ్ళి ఎలాగో లాగ నాన్నగారిని తీసుకువస్తాగా.' అంటూ నవ్వుతూ గబగబ వీధిలోనికి అడుగులు వేశాడు. కృష్ణుడు కంటికి కనిపించేదాక జానకమ్మ కొడుకుకేసిచూస్తూ గుమ్మంలో నిలబడి పోయింది.

తల్లియిచ్చిన బట్టలసంచీ బుజాన తగిలించుకుని, కాలవరోడ్డు పట్టాడు కృష్ణుడు. అప్పుడప్పుడు కాలవకు నాన్నతో అమ్మతో స్నానాలకు వెళ్ళేవాడు. అందుచేత ఆ రోడ్డు పూర్తిగా జ్ఞాపకం.

మైలుదూరం నడిచి, కాలవస్నానాల రేవు దగ్గర చేరాడు కృష్ణుడు. అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఫర్లాంగు దూరంలో ప్రయాణీకులను కాలవ రెండవగట్టుకు చేరుస్తున్నాడొకడు దోనెలో. కాలవ రెండు వైపులాఉన్న ఈతచెట్లు రివ్వున వీచేగాలికి తలలాడిస్తున్నాయి.

ఎవరో ఒక అపరిచితుడు, ముసలాయన చుట్ట కాల్చుకుంటూ, ఆ దారిని పోతూంటే కృష్ణుడు పలకరించాడు.

'ఏమండి! కోటిఫలికి వెళ్ళే పడవలు యిక్కడికే వస్తాయాండి?'

'ఆఁ'

'ఎన్ని గంటలకు వస్తాయో మీకు తెలుసా.'

'ఒక అరగంటలో రావచ్చు'

అంటూ నోట్లోంచి ఆయన చుట్ట తీసి, తుపుక్కున ఉమ్మేసి, తిరిగి నోట్లో చుట్టపెట్టుకుంటూ పరకాయించి చూశాడు కృష్ణుణ్ణి.

'ఎవరబ్బాయివి బాబూ'

'సత్యనారాయణగారి అబ్బాయిని.'

'అలాగా!...అయితే మీ నాన్నగారిప్పుడు ఎక్కడుంటున్నారు.'

'కోటిఫలిలో ఉంటున్నారు' అన్నాడు ధీమాగా కృష్ణుడు. ఆ ముసలాయన మాటల్లోని అంతరార్థం తెలియకపోయినా.

'హిహిహి: అలాగా' అనుకుంటూ ఆ ముసలాయన వెళ్ళిపోయాడు.

కృష్ణుడు అదే పడవల రేవని నిశ్చయించుకున్నాడు. మరోక్షణం ప్రక్కకి చూడగానే ఆమడదూరంలో ఒక పడవ కనిపించిది. ముగ్గురు మనుష్యులు త్రాడుపడవకుకట్టి గట్టుమీద నడుస్తూలాగడం చూశాడు. నిండు కాలవ నీటిలో తెరచాప విప్పుకొని అందంగా మందయానం చేస్తూన్న ఆ పడవ ఒయ్యారా లొలికిస్తూ రెక్కలు విప్పుకు నడిచే హంసలా ఉంది. పడవ రేవుచేరింది. గట్టుమీదనుంచి పడవ లాగేవాళ్ళు తాడు చుట్టిదానిలో వల విసిరేరు.

లావుగా బొద్దుగా, నల్లగా గిరజాలు వేసుకొని చెవులకు వెండి కమ్మలు తగిలించుకుని పడవ తెడ్డుతో ఖయటనుంచున్న మనిషి కృష్ణుడిని పలకరించాడు.

'ఏప్పూ రెడతావయ్యా!'

'కోటిపలి!'

'ఎక్కు ఎక్కు' అంటూ పళుక్కుమని కర్ర విరిచినట్లు అని ఊరు కున్నాడు. ఆ పడవ ఆసామీ.

'టిక్కెట్టెంత?'

మూడు అణాలు.'

'ఎంతసేపట్లో బయలుదేరుతుంది.

'అదేపోతుంది ఎక్కవయ్యా' అంటూ కసిరాడు ఆ పడవపెద్ద.

కృష్ణుడు పడవ ఎక్కాడు. నిమ్మకాయలు నిలవఃకలిగే ఆ పడవ ఆసామీ పెద్ద మీసాలు, చింతనిప్పుల్లాంటి ఎర్రటి కళ్ళుచూసి, వీళ్ళు దొంగ లేమో అని లోపల భయపడ్డాడు కృష్ణుడు. పడవలోపలికి వెళ్ళగానే ఒక ముప్పయి ఏండ్ల వితంతువు, ఒక ఐదేళ్ళకుర్రాడు. శాలువా కప్పుకుని శ్రోత్రియంగా కనపడుతున్న ఒక మధ్య వయస్కుశాస్త్రిల్లుగారు కనిపించారు.

'పిన్నిగారూ యీ పడవ కోటిఫలి వెడుతుంది కదండి' అని వరుస కలిపి, చనువుచేసుకుంటూ ఆ వితంతువును పలకరించాడు కృష్ణుడు.

'వెడుతుంది బాబూ'

కృష్ణుడి మనస్సు స్థిమితపడింది.

'ఆ అబ్బాయి మీ కొడుకాండి'

'కరిచేస్తా నీకెందుకు నా గొడవ' అనుస్తూ ఆ కుర్రాడు గాండ్రించి కృష్ణుడి వైపు చురచురా చూశాడు.

యీ లోపుగా వితంతువు అడ్డుకుంది. 'వాడికి మతిలేదు నాయనా ఏమీ పలకరించకు.' అది వినగానే ఆ కుర్రాడు చర్రున లేచి 'నాకు మతి లేదూ' అంటూ ఆ వితంతువును కొట్టబోయాడు. ఎదురుగా ఉన్న శాస్త్రి గారు ఆ కుర్రాడిని పట్టుకుని బెదిరించి మూల కూర్చోబెట్టారు. ఒక నిట్టూర్పు విడిచి 'కర్మ' అంటూ చేతిలో రుద్రాక్షమాల త్రిప్పడం మొదలు పెట్టారు ఏదో జపిస్తూ.

కృష్ణుడు యింక వాళ్ళతో మాట్లాడలేదు. పడవ కదిలింది. పడవ నడుస్తూన్నంతసేపు అతనికి భయమే; మధ్యలో యీ పిచ్చికుర్రాడు లేచి పీక నొక్కుతాడేమోఅని. నల్లగా దొంగల్లా కనిపించే పడవవాళ్ళు తన నంచీ దొంగిలిస్తారేమో అని ఒళ్ళో దాన్ని గట్టిగా పట్టుకుని ముడుచుకు కూర్చున్నాడు.

పడవ నడుస్తోంది. చుట్టూ నిశీథం. పడవముందు కట్టిన హరికేన్ లాంతరు వెల్తురు మాత్రం కాలవనీటిలో పడి, బంగారురంగుతో పడవ రహదారి నీటిమీద మలిచినట్లయింది.

తన జీవితంలో మొట్టమొదటి ప్రయాణం అది కృష్ణుడికి. పడవకున్న అద్దాల కిటికీద్వారా బయటకి చూశాడు. ఆ నిశీథంలో చెట్లు గుబురు గుబురుగా కనిపించాయి. ఆకాశంలో చుక్కలు మిల మిలా

మెరుస్తున్నాయి చూస్తున్న కొలదీ, తను చూడవలసిన విశాలప్రపంచం యింకా ఎంతో వుందనిపించింది.

ఒక లాకు వద్ద పడవ ఆగింది. లాకు తలుపులు తెరుచుకున్నాయి. లాకులో పాతాళంలో ఉన్నట్లుంది. పడవ, పడవ ఆసాములు చుట్టపొగ గుప్పు గుప్పున వదులుతున్నారు. పాతాళంలో ఉన్నా పడవ క్రమక్రమంగా పైకి తేలడం మొదలెట్టింది. అది ఎంతో చిత్రంగా ఉంది కృష్ణుడికి. లాకు లోంచి బయటికి వచ్చాక ఆ పడవని ఆరాత్రికి అక్కడ కట్టేశాడు; దారిలో ముందు దోపిడి దొంగల గొడవ ఎక్కువగా ఉందని.

రాత్రి లాకులవద్ద ఆగిపోవడంవల్ల, తెల్లవారగానే కోటిఫలి చేర వలసిన పడవ, మధ్యాహ్నం పదకొండు గంటలకు చేరింది.

కృష్ణుడు పడవదిగి ఊళ్ళోకి నడిచాడు. ఎండ మిటమిటలాడు తూంది. దారిలో రైతు ఒకడు కర్రపుచ్చుకుని పోతూంటే "ఇనస్పెక్టరు సత్యనారాయణ గారెక్కడుంటారో తెలుసా" అని అడిగాడు. "ఏ ఇనస్పెక్టరయ్యా" అంటూ సాగిపోయాడు రైతు.

కృష్ణుడికి ఒక ఆలోచన తట్టింది. తండ్రి ఆఫీసు కనుక్కుంటే యింటికి ఎవరో ఒకరు అక్కడినుంచి దారి చూపిస్తారని ఆశ కలిగింది. రెండడుగులు వేయగానే పోస్టు బంట్రోతు ఎదురయ్యాడు. అతన్ని అడిగాడు ఇనస్పెక్టరుగారి ఆఫీసు ఎక్కడని.

"ఏ ఇనస్పెక్టరు, పోలీసా ? రెవిన్యూ ? కోపరేటివ్ ? ఎవరు?"

"సత్యనారాయణగారు"

పోస్టు బంట్రోతుకు అర్థమైంది. ఆఫీసుకు దారి చూపించాడు.

ఆఫీసు గుమ్మంలో చేరగానే, ఎదురు గదిలో, ముగ్గురు గుమాస్తాలు, కాగితాలు బరబరా, చెమట్లు కార్చుకుంటూ గీసేస్తున్నారు. వాళ్ళని అడిగాడు కృష్ణుడు "సత్యనారాయణగారున్నారా" అని.

ఎందుకు' అన్నాడొక ముసలిగుమాస్తా. కళ్ళజోడు జాగ్రత్తగా పైకి ఎత్తిచూస్తూ.

'మా నాన్నగారు ఆయన' అన్నాడు కృష్ణుడు. ఆ ముసలిగుమాస్తా ఒక్క గెంతువేసి లేచాడు.

"రండి రండి అబ్బాయిగారూ లోపలికి రండి." అంటూ ఆఫీసు గదలోనుంచి వరండాలోకి తీసుకు వెళ్ళాడు. అడుగులకు మడుగులొత్తుతూ ముందు నడిచే ఆ ముసలి గుమాస్తా వైనంచూస్తే, తనకు రాచమర్యాదలు జరుపుతున్నట్లనిపించింది. కృష్ణుడు పొంగిపోయాడు. తన తండ్రి చాలా గొప్ప ఉద్యోగి అని. వెనకవున్న గుమాస్తాలు 'ఇనస్పెక్టరుగారి అబ్బాయిటా' అంటూ నోరు ఆవలించారు.

ఆఫీసుగది దాటి లోపల వరండాలో కాలుపెడుతూ 'మీ అబ్బాయి గారొచ్చారండి' అన్నాడు ఆ ముసలి గుమాస్తా.

"రమ్మను లోపలికి" అన్నాడు సత్యనారాయణ విసుగా. గుమాస్తా అన్న ముక్కలు పూర్తిగా వినిపించుకోకుండానే.

వరండాలో అడుగుపెట్టగానే పదిమంది జనం గుండ్రంగా కూర్చుని, ఎదురుగా రూపాయలు ఖంగుమనిపిస్తూ, ఎర్రటి చింత నిప్పుల్లాంటి కళ్ళతో తీవ్రంగా ఒకరి నొకరు చూసుకుంటూ పేకముక్కలు సర్దుకుంటున్నారు. అసలు కృష్ణుడిని చూసే తీరిక లేనట్టున్నారు ఆ జనం.

'నాన్నా'నాన్నా 'అన్నాడు కృష్ణుడు భయంతో.

సత్యనారాయణ తల పైకెత్తిచూశాడు. మోకాలుదాకా చిన్న నల్లని నిక్కరు తొడుక్కుని, మాసిపోయిన తెల్లని చొక్కాతో, బుజానికి సంచీ తగిలించుకుని, చెల్లాచెదిరి రేగిరే ముంగురులతో, చెప్పులు లేని పాదాలతో, ఎండదెబ్బకు నీరసిల్లిన గొంతుకతో యెదురుగా నిలుచున్న కృష్ణుణ్ణి

చూసి ఆశ్చర్యపోయాడు సత్యనారాయణ. ముప్పైమైళ్ళ దూరంనుంచి యెలా వచ్చాడో, ఎందుకు వచ్చాడో, అర్థం కాలేదు ఆయనకు.

'ఏరా! యిదేనా రావడం! యింటిదగ్గర అంతా కులాసాగా వున్నారా' అన్నాడు సత్యనారాయణ కంగారుగా.

'అంతా బాగున్నారు నాన్నా' అంటూ నంచీ బుజాన్నించి తీసి, గబగబా వెళ్ళి తండ్రి ప్రక్కన కూర్చున్నాడు కృష్ణుడు. నెలా పదిహేను రోజుల తర్వాత కొడుకును చూసిన సత్యనారాయణకు పుత్రవాత్సల్యం ఉప్పొంగింది. ఐదు నిమిషాలలో పేకాట ముగించి లేచారు. ప్రక్కనున్న స్నేహిత బృందం 'యితను మీ అబ్బాయి ఏమిటోయి? ఏం చదువు తున్నావు? అబ్బో! ఇంతదూరం ఒంటరిగా ప్రయాణంచేసి వచ్చావన్న మాట' అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు. 'మరి మావాడంటే ఏమను కున్నారు' అంటూ సత్యనారాయణ కొడుకు చదువు, తెలివితేటలు గురించి గర్వంగా సమాధానం యిచ్చేడు. కృష్ణుడు ఠీవిగా నవ్వేడు, తను గొప్ప వాడన్నట్లు అందరూ పొగడుతూంటే.

ఇంటికి తీసుకువెళ్ళేడు తండ్రి. చేతివేళ్ళు పట్టుకుని నడుస్తూ, 'నాన్నా యిది మీ ఆఫీసా' అని అడిగాడు కృష్ణుడు.

'అవును.'

'మరి! ఆఫీసులో పేకాడుతారా?'

'ఏడిశావు! ఆ గొడవ నీకెందుకు?'

'అది కాదు నాన్నా అందరూ మరి కాగితాలు వ్రాస్తారుకదూ!'

'అవును మనకు ముగ్గురు గుమాస్తాలున్నారుకదూ, అంతపనీ వాళ్ళే చేసేస్తారు.'

కృష్ణుడు ఇంక మాట్లాడలేదు ఆ విషయం గురించి. ఇంటికి వెళ్లాక స్నానంచేసి దుస్తులు మార్చుకున్నాడు. కృష్ణుడు ఎందుకు వచ్చాడో తెలుసుకునే ఆలోచనలో నిమగ్నుడైన సత్యనారాయణ తేరుకున్నాడు. కృష్ణుడు దుస్తులు మార్చుకురాగానే యిద్దరు హొటలువైపు నడిచారు.

తాటాకులతో కట్టిన ఆ హొటలు ముందుభాగం అందంగా మేజా బల్లలతో నిండివుంది. లోపల గదిలో మేజా బల్లమీద భోజనాలు వడ్డించారు. వడ్డించే మనిషి 'మీ అబ్బాయిగారాండి' అంటూ కృష్ణుడివైపు చూశాడు. అవునన్నట్లు నవ్వాడు సత్యనారాయణ. 'అలాగాండి' అంటూ అతను యింకా రెండుసార్లు అన్ని వంటకాలు ఎక్కువచేస్తూ అతి మర్యాదగా భోజనం పెట్టాడు.

'అమ్మ నిన్ను ఎందుకు పంపిందిరా' అన్నాడు సత్యనారాయణ భోజనాలయినాక, యింటికి వస్తూంటే.

'నీకోసం బెంగపెట్టుకుంది నాన్నా. అస్తమానూ ఒక మూల కూర్చుని యేడుస్తూంది.

కృష్ణుడి మాటలు వినేటప్పటికి కోపంతో కఠినమయిన అతని హృదయం కరిగింది.

'పైగా యింట్లో డబ్బులేదు. బియ్యం వీరన్న, పాలసూరమ్మ, దాసీది, కొట్టువాడు, అస్తమానూ బాకీలు యివ్వమని పీక్కుతింటున్నారు నాన్నా. యిన్నాళ్ళు నువ్వు యింటికి వస్తావేమో అని చూసింది. నువ్వు రాలేదు అందుచేత చేతిలో మిగిలిన పావలా యిచ్చి నన్ను యిలా పడవమీద పంపించింది.

'పాపం! ఏం యిబ్బంది పడ్డారో యిన్నాళ్ళ' అనుకున్నాడు సత్యనారాయణ. ఇంతకీ ఒక చిన్న విషయంపై తాను అన్యాయంగా జానకమ్మను బాధపెట్టానని నొచ్చుకున్నాడు......

ఆరోజు, ఆఫీసు పనిమీద తిరిగి తిరిగి రాత్రి యింటికివచ్చాడు సత్యనారాయణ, గుమ్మంలో నుంచుని ఎప్పుడూ నవ్వుతూ ఆహ్వానించే జానకమ్మ ఆవేళ మూతిముడుచుకుని కూర్చుంది. విస్తట్లో అన్నం పెట్టి అడిగింది.

'రెండెకరాల భూమి అమ్మేశారుట కదూ!'

'ఎవరు చెప్పారు!'

'ఎవరో చెప్పడమేమిటి ఊరంతా అనుకుంటూంటే.'

'ఈ ఆడముండలకు మరోపని లేదు.'

'అబద్ధాలాడ్డ మెందుకని?'

'ఎవరని?'

'మీరే...పిల్లలు రొుదుగుతున్నారు. బోలెడు ఖర్చు ముందువుంది. ఇలా భూములు అమ్ముకుంటూంటే సంసారం బాగుపడినట్లే'

'చాల్లే నువ్వు నాకేమీ సలహా లివ్వనక్కర్లేదు.'

'ఇల్లాగే అంటూండండి, చివరికి ఆస్తి అంతా తగులడ్డాక పిల్లలు ముష్టి రొుత్తుకునేదాకా తెలిసిరాదు.'

'చాల్లే! నోరుముయ్యి.'

'ఆ పేకాట మానకూడదూ, మీకో దండం పెడతాను' రుస రుసలాడింది జానకమ్మ.

సత్యనారాయణ కోపం ఆగలేదు. వెండి కంచంలోని అన్నం గిరవాటేసి, ఛెళ్ళున జానకమ్మ దవడమీద కొట్టాడు. జానకమ్మ గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ ఏడ్చింది. జేబులో వున్న రూపాయినోట్లు ఆమెమీద విసిరేసి. తక్షణం వంచి, కోటు తొడుక్కుని సైకిలు తీసుకుని, అర్థరాత్రి కోటిపలి వచ్చేశాడు.

జరిగిన సంగతి కంటి ముందు తిరిగింది. తప్పెవరిది? సత్యనారాయణ ప్రశ్నించుకుని పశ్చాత్తాప పడ్డాడు. భూమి అమ్మినమాట వాస్తవమే. డబ్బు అరువుపెట్టి పేకాట ఆడాడు. ప్రతిసారి వోడిపోయాడు. మూడు వేలు బాకీపడ్డాడు. ఒకరోజు పేకాట ఆడుతూంటే స్నేహితులందరూ నానామాటలు అన్నారు. 'ఎంతకాలం యిలా అరువుమీద పేకాడతావు. ఆ డబ్బు రేపివ్వకపోతే మాట దక్కదని సత్యనారాయణకు వుక్రోషం, వుడుకుమోతుతనం వచ్చి, భూమి అమ్మేసి, బాకీలు తీర్చగా, మిగిలిన డబ్బు ఆరోజు రాత్రి జానకమ్మపై విసిరేశాడు.

తను భూమి అమ్మిన సంగతి జానకమ్మకు తెలియకూడదనుకున్నాడు. తెలిసినందుకు చాలాకోపం వచ్చింది. ఆమె రెట్టించి అడుగుతూంటే ఒళ్ళుమండింది. అందుచేత ఆమె చెంప ఛెడేలుమంది.

కొడుకు చదువుకోసం, ఉన్నవూరని, సంసారం అక్కడ వుంచేసి తను కోటిఫలిలో హొటల్లో తింటూ కాలం గడుపుతున్నాడు సత్యనారాయణ. జానకమ్మ వ్రాసిన ఉత్తరాలు కోపంకొద్దీ చదవనైనా లేదు. మళ్ళీ పేకాట ధోరణిలోపడి యింటి సంగతి తలపెట్టలేదు.

'నాన్నా! యింటికి రమ్మంది అమ్మ నిన్ను. చెల్లాయికి యీ మధ్య చాలా జ్వరం వచ్చింది, నీకోసం రోజూ పలవరిస్తోంది.'

కృష్ణుడి అమాయక ప్రాధేయత చూసి, ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. ఏడుస్తున్న జానకమ్మ యెదురుగా కనిపించినట్లయింది. తన పదేండ్ల సంసారంలో భార్యపై చేయిచేసుకోవడం అదే ప్రథమం, పాపం! ఎంత బాధపడిందో, అనుకున్నాడు.

'బాబయ్యా! ఒక్క కాసీ యిప్పించరూ. ఆకలి వేస్తోంది' అంటూ పదేళ్ళ కుర్రవాడు చిరిగిన లాగు చొక్కాతో నీరసంగా శవంలా నుంచున్నాడు వీధిలో. సత్యనారాయణ హృదయం కరిగి వాడిచేతిలో అణా వేశాడు.

'నాన్నా! ఆ కుర్రాడు అచ్చు నాలాగే వున్నాడు' అన్నాడు కృష్ణుడు.

సత్యనారాయణ మనస్సు చివుక్కుమంది. నిజం. ఆస్తివున్నా, తన పేకాట గొడవలలో సంసారం సంగతే మరిచిపోయేవాడుతను. పిల్లలకు కావలసినవన్నీ జానకమ్మ చూసుకునేది. ఉన్న ఆరెకరాల ఆస్తి అంతా పేకాటల్లో తగులబెడితే తన కొడుకు తన అనంతరం యీ మస్థితి కుర్రాడిలా మారవచ్చు. ఈ ఆలోచన, కృష్ణుడి మాటలు, అతన్ని కలవరపెట్టాయి. సత్యనారాయణ భయంతో వణికి పోయాడు.

'లేదు! నువ్వు అలా లేవు కృష్ణా! అలా యెప్పటికీ వుండవు!' అంటూ ఉద్వేగంతో సత్యనారాయణ కృష్ణుడిని కౌగిలించుకున్నాడు. ఆ ఉద్రేకంతో అతని కంటినుంచి బాష్పాలు రాలాయి.

'అదేమిటి నాన్నా ఏడుస్తావెందుకూ!'

'ఏంలేదు అమ్మదగ్గరకు వెడదాంలే' అంటూ బట్టలు సర్దుకుని, కొడుకుని వెంటబెట్టుకుని, జట్కాలో గబగబా బస్సుస్టాండు ధగ్గరికి

వెళ్ళాడు సత్యనారాయణ. కాని అప్పుడే ఆఖరిబస్సు వెళ్ళిపోయిందని తెలిసింది.

కాని సత్యనారాయణకు ఎలాగైనా ఆరాత్రి యింటికి వెళ్ళిపోవా లనిపించింది. ఆఫీసుకు వెళ్ళి సైకిలు తీశాడు. కృష్ణుని ముందుకూర్చో బెట్టు కుని, గబగబా కాలువగట్టున శరవేగంతో సైకిలు తొక్కడం మొదలు పెట్టాడు. కృష్ణుడు ఏవేవో అడుగుతూంటే, అతను ఊకొట్టడమే కాని; దృష్టి అంతా జానకమ్మ పైనేవుంది.

రాత్రి పదిగంటలకు యిద్దరూ యిల్లు చేరారు. వీధిలోంచి కృష్ణుడు సైకిలుగంట గణగణ గట్టిగా మోగించాడు. జానకమ్మ తలుపు తెరిచింది. రాత్రిళ్ళు సత్యనారాయణ వస్తే అలా గంట మ్రోగించడం అలవాటు. సత్యనారాయణ నవ్వుతూ యింట్లో అడుగుపెట్టాడు.

'అమ్మా! నాన్నను తీసుకువచ్చా చూశావా!' అంటూ తన ప్రతాపం వెలిబుచ్చాడు కృష్ణుడు. జానకమ్మ ఆనందంతో ఉప్పొంగిపోయింది. భర్తకు కాళ్ళు కడుక్కుందుకు, స్నానానికి నీళ్ళు యిచ్చింది. కొడుకూ తండ్రీ అన్నానికి సిద్ధమయ్యారు.

'ఏమండీ! ఇంకా నామీద కోపం తగ్గలేదా!' అంది జానకమ్మ నవ్వుతూ.

'అమ్మా! నాన్నకూడా ఆ ఊళ్ళో ఏడ్చాడే! నాన్నకు యిప్పుడు కోపంలేదు' అన్నాడు కృష్ణుడు.

'ఏడిశావు వెధవ' అన్నాడు సత్యనారాయణ నవ్వుతూ.

'ఏం! ఉన్నరహస్యం చెప్పినందుకు వుడుకుమోత్తనమా!' చిలిపిగా నవ్వింది జానకమ్మ.

'నీ రహస్యాలూ చెప్పాడులే నాకు' పరిహసించాడు సత్యనారాయణ.

'అబ్బ! మీరు యిన్నాళ్ళు రాకపోతే రోజులు యుగాలుగా గడిచాయండి' అంటూ జానకమ్మ ఒళ్ళు విరుచుకుని ఆవలించి, నవ్వింది.

తెల్లని చీర కట్టుకుని, చీరకు మించిన తెల్లని మల్లిపూలు తల్లో ముడిచి, మల్లిపూలకు మించిన తెల్లని నవ్వుల వెల్లులు జానకమ్మ పెదిమలమీద కురిపించగానే "ఊహు" అంటూ సత్యనారాయణ ఆమె బుగ్గమీద చిటికి వేశాడు. కృష్ణుడు ఫక్కున నవ్వాడు.

'ఏమిటిరా ఆ వెకిలినవ్వు' అని కేక లేసింది జానకమ్మ.

"ఎందుకే వాడిమీద కోపపడతావు. వాడు నీ రాయబారి కదూ!' అన్నాడు సత్యనారాయణ పరిహసిస్తూ.

# పోతుకూచి రచనలు



1. ఇదీతంతు (వ్యంగ్యహాస్య నాటిక)
   వాణీ గ్రంథమాల, సికింద్రాబాదు.
2. ఏడుసున్నలు (నాటిక) (జీవనరంగం)
   దేశోద్ధారక గ్రంథమాల, హైద్రాబాదు.
3. సాంబశివరావు కథలు
   ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ.
4. ఉదయ కిరణాలు (నవల)
   విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ.
5. ప్రతిధ్వనులు (నాటికలు)
   నవ్యసాహితీ సమితి, హైద్రాబాదు.

## త్వరలో వెలువడునవి:

1. ఏడురోజుల మజిలీ.
   (నవల)
2. అన్వేషణ.
   (నవల)
3. దొంగ - దొర.
   (ఏకాంకికలు)

